# శ్రీలక్ష్మీహారం

## శ్రీ లక్ష్మీనిధి - 2

శ్రీ లక్ష్మీహారం ఎందుకు రాయాల్సి వచ్చింది?!

ఆరునెలల క్రితం శ్రీలక్ష్మీనిధి పుస్తక గ్రంథాన్ని మీ ముందు వుంచాను. ఇంతటి ఘన విజయం ఇచ్చినందకు అపూర్వంగా అభినందనగా ఎంతో మంది ఫోన్ ద్వారా నన్ను సంప్రదించారు. ఇన్ని సంవత్సరాల రచనా వ్యాసంగంలో శ్రీలక్ష్మీనిధి గూర్చి ఎంతో మంది ఫోన్ చెయ్యటం నాకు తొలి అపూర్వ అనిర్వచనీయమైన అనుభూతి. అలా ఫోన్ చేసిన వారు ఎన్నో సందేహాలను వెళ్ళబుచ్చారు. శ్రీలక్ష్మీనిధిలో అవి లేవని చెప్పారు. మరో పుస్తకం రాయమన్నారు. అందువల్లే శ్రీలక్ష్మీహారం మీకు అందిస్తున్నాను. ఒక్కొక్కరితో మాట్లాడుతుంటే ధనం కోసం ఇన్ని నీచాలు చేస్తున్నారా, నేను చెప్పింది చాలా తక్కువనిపించింది. అందుకే ఈ శ్రీలక్ష్మీహారంలో శ్రీమహాలక్ష్మీదేవికి సంబంధించిన పూజలూ, నైవేద్యాలూ, వ్రతాలూ, ఇంకా శ్రీరామాయణ, భారత, భాగవత, శ్రీదేవీభాగవతము ఇంకా అష్టాదశపురాణాలను శోధించాను. శ్రీమహాలక్ష్మీ దేవికి సంబంధించిన చాలా విషయాలను అవగాహన చేసుకున్నాను. మీకందిస్తున్నాను. శ్రీలక్ష్మీనిధిలోనే కాదు, ఈ లక్ష్మీహారంలో కూడా నేను రాసినదంతా నిజం... అలాగే ఉదాహరణలన్నీ పురాణ ఇతి హాసాల్లోంచి తీసుకున్నవే. ధన, మాన, గౌరవ విషయాల్లో ఎవ్వరూ మోసపోకూడదనే నా ఈ ప్రయత్నం.....

- అభినందనలతో

మైథిలీ వెంకటేశ్వరరావు

*ఈ లక్ష్మీహారాన్ని ప్రశాంతంగా,*

*నిదానంగా వరుసక్రమంలో చదవండి.*

*శ్రీ లక్ష్మీ కటాక్ష ప్రాప్తిరస్తు...*

# శ్రీ లక్ష్మీహారం

## శ్రీనివాసుడు తన వివాహము కొరకు కుబేరుని వద్ద ధనమును అప్పుగా తీసుకొని వ్రాసి యిచ్చిన పత్రము

పరమశివుడు పద్మావతీ శ్రీనివాసుల కళ్యాణ విషయమై మాట్లాడుతూ "శ్రీనివాసా! శుభకార్యమును అప్పు చేసి అయినను ముగింపవలయును" అనగా శ్రీనివాసుడు కుబేరుని పిలిచి బ్రహ్మ, శంకరులతో కూడి పుష్కరిణి తీరమందున్న అశ్వత్థ వృక్షము చాటునకు పోయి కుబేరునితో "కుబేరా! కలియుగమున జరిగెడి నా వివాహమునకు యుగకాలానుసారము ధనము అప్పు



ఇవ్వుము. వడ్డీతో నీ అప్పు తీర్చెదను" అని అనగా "యుగధర్మము ననుసరించి అప్పు పత్రము వ్రాసి ఇచ్చిన ధనమిచ్చెదనని" కుబేరుడు చెప్పగా స్వామి అందులకు అంగీకరించి కుబేరునికి ఈ విధముగా పత్రము వ్రాసి ఇచ్చినాడు.

ఈ విళంబినామ సంవత్సర వైశాఖ శుక్ల దశమినాడు నారాయణ పురమును ఏలెడి ఆకాశరాజు పుత్రిక సౌ॥ పద్మావతీదేవితో నా వివాహమును పెద్దలు నిశ్చయించినందున, ఆ వివాహము కొరకు లంకాపురాధిపతి కుబేరుని వద్ద పదునాలుగులక్షల శ్రీరామముద్ర గల సువర్ణ నాణెములను వైశాఖ శుక్ల సప్తమి నాడు అప్పుగా తీసుకొనుచుంటిని. యుగ కాలానుసారముగా నా భక్తులు నాకు సమర్పించు ముడుపుల నుండి నూరు శ్రీరామ ముద్రికలకు ఒక ముద్రిక చొప్పున నెలకు వడ్డీగా అంగీకరించుతూ వ్రాసి ఇస్తున్న ఋణపత్రము.

సాక్షులు
బ్రహ్మ, రుద్రుడు
అశ్వత్థరాజము (రావిచెట్టు)

ఇట్లు
శ్రీ వేంకటాచలపతి,
వేంకటాచలము.

ఈ పత్రము తీసుకొని కుబేరుడిచ్చిన ధనముతో వేంకటాచలపతి భోజనమునకు కావలసిన సంభారమును తెచ్చి వివాహమునకు విచ్చేసిన అతిథులందరికీ పంచభక్ష్యపరమాన్నములను తొలుత వరాహస్వామికి నివేదన చేసి అనంతరము అందరికీ వడ్డించినారు. అంతా తృప్తిగా భుజించి "శ్రీవేంకటేశా! అమృత సమానమయిన ఈ విందు మాకు ముక్తి సాధనము. మా జన్మ ధన్యమైనది" అని స్తుతించిరి.

## మర్రిపండ్లు, పిప్పళ్ళు, మేడిపండ్లు అలాగే ఆవూ, పంది మాంసాలు తినకూడదు. తింటే రావాల్సిన ధనం ఆగిపోతుంది.

## 'లక్ష్మీ' శబ్దం ఎంతటి సిరులను కలిగిస్తుంది

లక్ష్మీదేవిని ధ్యానించటం వల్ల పరిపూర్ణ ఫలం కలుగదు. ముఖ్యంగా దేవాలయాలకి వెళ్ళినప్పుడు 'శ్రీలక్ష్మీనారాయణీ నమోనమః' అని మూడుసార్లు పైకి ఉచ్ఛరించాలి. అందుకే విష్ణు, శివ ఆలయాల్లో గోవిందా అనీ, నారాయణా అనీ, మహాశివా అనీ ఎలుగెత్తి వేడుకుంటారు. లోలోన ధ్యానించే భగవత్ పూజగానీ, దర్శనములు గాని పూర్తి ఫలాన్ని ఇవ్వలేవు.



## మీ సంతానం కుబేరులవ్వాలంటే

బిడ్డ జన్మించిన ఆరో రోజున ధనలక్ష్మి ఆ బిడ్డ యొక్క ధన సంబంధిత విషయాలను రాస్తుంది. భాగ్యలక్ష్మి ఏ రేఖలనయినా తారు మారు చెయ్యగలదు. పూర్వకాలంలో బిడ్డ జన్మించగానే ఆరో రోజు భాగ్యలక్ష్మి పూజ చేసి ఆమెని సంతృప్తురాలిని చేసి తమ సంతానాన్ని ఎత్తుకొని సిరిసౌభాగ్యాలతో తులతూగే విధంగా దీవించమని ప్రార్థించేవారు.

## తినగానే పూజలూ, జపాలూ, యోగాభ్యాసం వంటివి చేయటం వల్ల శుభఫలితాలు రావు.

## గృహంలో నట్టింటి ప్రదేశం

అక్క జ్యేష్ఠాదేవి స్థానం. గృహిణి నట్టింటిలో కూర్చుని తాను గానీ, తన సంతానానికి గానీ జుట్టు దువ్వటం, దువ్వుకోవటం వంటివి చేస్తే సాక్ష్యాత్తు లక్ష్మి సోదరిని ఆహ్వానించినట్టే. అలాగే దువ్వెనలోని జుట్టుని తీసి పక్కన పడేసి తమ పని తాము చేసుకుంటుంటారు. అలా చెయ్యటం వల్ల ఆ చిక్కు జుట్టు గాలికి ఇల్లంతా తిరుగుతుంటుంది. దానితో జ్యేష్ఠాదేవి ఆ గృహాన్ని తన ఆధీనంలోకి తీసుకుంటుంది. పెట్టాల్సిన సమస్త కష్టాలనూ పెడుతుంది. అలాగే గృహంలో నిమ్మచెట్టు వుండటం ధన నష్టాలని కలిగిస్తుంది.

## ధనం మూలం ఇదమ్ జగత్

అరణ్యంగుండా ఓ వ్యాపారి ప్రయాణిస్తున్నాడు. అకస్మాత్తుగా దొంగలు ఎదురొచ్చి కత్తులను చూపించారు. తుంటిలోనున్న ధనం మూటను ఇవ్వకపోతే చంపేస్తామన్నారు. దానికి ఆ వ్యాపారి అంగీకరించలేదు. దానితో దొంగలు నీ ధనం మాకు అక్కరలేదు నీ తల కావాలన్నారు. దానికా వ్యాపారి కావాలంటే నా తల తీసుకోండి ధనాన్ని మాత్రం ఇవ్వనన్నాడు.

దొంగలు ఆశ్చర్యపడి అదేమిటని అడిగారు. 'ధనం లేకపోతే ఎలా బ్రతుకగలను. తలలేకపోయినా పర్వాలేదు ధనముంటే చాలు బ్రతకవచ్చు. మీకు తలలున్నాయి గాని ధనం లేదు అందుకే ఈ పనులు చేస్తున్నారు అని తల గొప్పదా, ధనం గొప్పదా అని అడిగాడు.' కాన ఈ కథలో లాజిక్ వదిలేయండి. ఆలోచించండి. వ్యాపారి చెప్పింది అర్థం చేసుకుంటే ఈ కథకి పరమార్థం చేకూరినట్టే.

## అపార లక్ష్మీ అనుగ్రహానికి

'శ్రీం' అన్న పదాన్ని పదహారు సార్లు ప్రతిరోజూ శుచిగా జపించాలి. ఆపై 'ఓం శ్రీం శ్రీం ధనలక్ష్మీ దేవ్యైనమః' అని ధ్యానించటం ద్వారా విష్ణు సతి అనుగ్రహం అపారంగా కలుగుతుంది.



## ధనలక్ష్మీ ఆగ్రహానికి గురికావద్దు

– గల్లాపెట్టి పరిశుభ్రంగా ఉంచుకోకపోవటం.

– ధనాన్ని పెట్టకూడని చోట్ల పెట్టడం. ఉదాహరణకి కొంతమంది స్త్రీలు వారి డబ్బుని ఎక్కడ్నించి తీస్తారో తెలియంది కాదు. అది మహా దోషం. కొంతమంది మగవాళ్ళు నడుం క్రిందలో గుడ్డల్లో దాస్తుంటారు. అది చాలా తప్పు. లక్ష్మీదేవిని గౌరవించాలి. గౌరవం లేని చోట లక్ష్మి ఉండదు.

– మరికొంతమంది డబ్బు విసిరేస్తుంటారు. ఇంకొంతమంది డబ్బు సంబంధిత విషయాల్లో చులకన చేస్తుంటారు. ఇంకా కంచం విసిరేస్తుంటారు. విసిరేస్తే కంచం లేచి నుల్చుంటుంది. అంటే శ్రీలక్ష్మి వెళ్ళిపోవటానికి అదే సందేశం. కాన ఇవి లక్ష్మీ అనుగ్రహానికి కాకుండా ఆ తల్లి కోపానికి గురి చేస్తాయి.

## ఆరోగ్య ఐశ్వర్యాల కోసం

కార్తీక శుద్ధ ఏకాదశి రోజున శంఖమును పూజామందిరంలో ఉంచి పూజిస్తే మహాలక్ష్మి అనుగ్రహిస్తుంది. బెల్లం, పంచదారలను నైవేద్యంగా సమర్పించాలి. ఉపవాసం ఉండాలి. రాత్రి ఓపికున్నంత వరకూ జాగరణ చేసి లక్ష్మీనారాయణుల స్తోత్రాలను పఠించాలి.

## భోగభాగ్యాలూ, ధన కనక వస్తువుల కోసం

చైత్రశుద్ధ పంచమీ, గురువారం రోజున ఔదంబర వృక్షాన్ని అనగా బ్రహ్మదేవుడిని పూజించాలి. మధురమైన నైవేద్యాలను అర్పించాలి. ఆ రోజున బ్రహ్మచర్యం పాటించాలి. ఫలాలను పంచాలి. అలా చేసిన వారికి ఆయా కోర్కెలు తీరుతాయి.

## శని అనుగ్రహం కోసం, లక్ష్మీ ఆశీస్సుల కోసం

జ్యేష్ఠశుద్ధ అష్టమి నాడు రావిచెట్టును పూజించి చిమ్మిలి నైవేద్యం చేసి అర్పించాలి. నువ్వుల నూనెతో దీపాన్ని వెలిగించాలి. ఉపవాస దీక్షతో పూజించిన వారికి శనిగ్రహ దోషాలు పోయి సంపదలు వృద్ధి చెందుతాయి. వ్యాపార వ్యవహారాల్లో కలిసి వస్తుంది.

## ఉద్యోగ, వ్యాపారాల కోసం

మార్గశిర శుద్ధ పాడ్యమినాడు లక్ష్మీనారాయణులను పూజించి నైవేద్యంగా పులిహోరనూ, అట్లనూ సమర్పించాలి. ఉపవాసాదులు చేసి చంద్రుడిని చూసి జాగరణ చేసిన వారికి ఆయా మనోవాంఛలు సిద్ధిస్తాయి.



## మంగళ సూత్రాలు పరులకి కానరాకూడదు

స్త్రీ ధరించే మంగళ సూత్రాల్లోనే భర్త శక్తి సామర్థ్యాలూ, కీర్తీ, ఆయుష్షూ నిక్షిప్తమై ఉంటాయి. గృహిణి పుణ్య, శీల శక్తులూ కూడా అందు నిక్షిప్తమై ఉంటాయి. అట్టి రహస్యమైన వాటినీ, శక్తికల వాటినీ పరుల కళ్ళ పడనీయకూడదు. మంగళసూత్రాలను పైకి కనపడే విధంగా వేసుకోవటం ద్వారా కామవాంఛను బయటపెట్టినట్టు అవుతుంది. దానికే 'ప్రతిభారతి సతిమానం చంద్రమతి మాంగళ్యం' అని ఇతిహాసాల్లో చెప్పేది. సత్య, కృత, ద్వాపర యుగాల్లో మంగళ సూత్రాలు భర్తకి తప్ప పరులకి కనిపించేవి కావు. వ్రతపూజాదినోముల సమయంలో ముత్తైదువులు ఇచ్చిన పసుపుని తీసి మంగళసూత్రాలకి అద్దుకునేటప్పుడు కూడా చాటు ఉండాలి. ఇంకా ఎడమ చేత్తో పసుపుని సూత్రం తాడుకి వ్రాయకూడదు. అలా కాకుండా నిర్లక్ష్యంగా ప్రవర్తించటం ద్వారా సుఖాలే కాదు గౌరవం కూడా తొలగిపోతుంది.

## నవ సంపదలు

ధనధాన్యాలు... వాహనములు... శిష్యులు... సంతానము... స్నేహితులు.. పనివారు... సామర్థ్యం.. విద్య... వస్తువులు.

## అధిక ఆదాయం కోసం

ఫాల్గుణ శుద్ధ పౌర్ణమినాడు లక్ష్మీదేవిని పూజించి చలిమిడీ, వడపప్పు, పానకములను నైవేద్యంగా అర్పించి ఉపవాస దీక్ష చేయడం ద్వారా సంతృప్తీ, అధిక ఆదాయ అవకాశాలు వస్తాయి. సుఖశాంతులు కలుగుతాయి.

## అష్టదరిద్రాలకీ, అష్టకష్టాలకీ కారణాలు

వాటికి కారణాలను భీష్ముడు ఇలా చెబుతాడు. అన్నింటికీ పేరాసే కారణము. కోరికలు పట్ల నిలకడ లేనితనము. కోపమూ, పగా, హింసాప్రవృత్తీ, పక్కవాడి భార్యపై కామం... నిందలకి కూడా వెనకాడకుండా అత్యాశ పడటము.. తొందరపాటు... ఇత్యాదివన్నీ అజ్ఞానము వల్ల కలుగుతాయి. అజ్ఞానమన్నది లోభము వల్లే పుడుతుంది. ఆ ఒక్క లోభమే సకల భోగాలనూ, సంపదలనూ, హితులనూ, సన్నిహితులనూ దూరం చేస్తుంది.

చక్కటి నడవడిక, చెలిమి, జాలి, పేరాస లేకపోవటము, ఓర్పు ఇవే మహా మేలైన జాతి గుణాలు. అవి సర్వమూ సకల సంపదలని తెచ్చిపెడతాయని అమృతమయమైన జ్ఞానాన్ని బోధించాడు దేవవ్రతుడు అనగా భీష్ముడు.



## ఇంటి ఇల్లాలు గృహలక్ష్మే కాదు...

శ్రీమహాలక్ష్మి భర్తపై కోపంతో కరివీరపురం వెళ్ళింది. అనగా నేటి కొల్హాపురం. ఆమెను అనుసరిస్తూ భూలోకానికి వచ్చిన శ్రీమన్నారాయణుడు తిరుమల గిరుల్లో వున్నాడని తెలుసుకొని ఆకలి బాధను తన పతి పడకూడదని అక్కణ్నించి తన పుత్రులైన బ్రహ్మదేవుణ్ని ఆవును కమ్మనీ, తన మనుమడైన మహాశివుణ్ని దూడగా వుండమనీ, తాను గొల్లస్త్రీ రూపంతో ఆ దేశపు రాజు వద్దకు వెళ్ళి ఆవుదూడలను అమ్మింది. ఆ ఆవే శ్రీనివాసుడి ఆకలి బాధలను తీర్చింది. భార్య నగలూ, చీరలూ అడిగేదే కాదు ప్రతి నిముషం భర్త ఆకలిని సదా గమనిస్తుండేది కూడా.

## శ్రావణ శనివారాలు ఎంతటి లక్ష్మీప్రదమైనవి

మాఘమాసంలో ఆదివారాలూ, కార్తీకమాసంలో సోమవారాలూ అలాగే మార్గశిర మాసంలో లక్ష్మీవారాలు మహా పుణ్యమైనవి. శ్రావణ మాసంలో శని, మంగళ, శుక్రవారాలు మహా ఫలాలనీ, సుఖాలనీ, ఐశ్వర్యాన్నీ ఇస్తాయి. ఆ రోజుల్లో చేసే పూజల వల్ల సుఖశాంతులకూ, సిరులకూ కొదవ వుండదు.

## శ్రీలక్ష్మీనిధిని పొందాలంటే

అయిదు శుద్ధతలుండాలి. అనగా శుభ్రములు. మొదటిది వాక్ శుద్ధి. వేలకోట్ల ప్రాణులను సృష్టించిన ఆ భగవానుడు మాట్లాడే వరాన్ని మనుష్యులకే ఇచ్చాడు. కాన వాక్కును దుర్వినియోగం చేయకూడదు. పగ, కసి, ద్వేషంతో సాటివారిని ప్రత్యక్షంగాగానీ, పరోక్షంగాగానీ నిందించకూడదు. మంచిగా, నెమ్మదిగా ఆదరణతో పలకరించాలి. అమంగళాలు మాట్లాడేవారు ఎదురైతే ఓ నమస్కారం పెట్టి పక్కకొచ్చేయాలి.

రెండవది దేహశుద్ధి. మన శరీరం దేవుని ఆలయం వంటిది. పరిశుభ్రంగా రెండు పూటలా స్నానం చేయాలి. చినిగిన వస్త్రాలను ధరించకూడదు.

మూడవది భాండశుద్ధి. శరీరానికి కావలిసిన శక్తినిచ్చేది ఆహారం. అందుకే ఆ ఆహారాన్ని అందించే పాత్ర పరిశుభ్రంగా ఉండాలి. స్నానం చేసి శుభ్రపరిచిన వంట పాత్రలలో చేసిన వంట అమృతతుల్యమైనది.

నాలుగోది కర్మశుద్ధి. అనుకున్న కార్యాన్ని మధ్య ఆపినవాడు అధముడు. అసలు కార్యాన్నే ప్రారంభించనివాడు అధమాధముడు. తలపెట్టిన కార్యాన్ని కర్మశుద్ధితో పూర్తి చేసిన వాడు ఉన్నతుడు.

మనఃశుద్ధి. మనస్సును ఎప్పుడూ ధర్మన్యాయమార్గాలవైపు మళ్ళించాలి. మనసు కోతి వంటిది. ఎప్పుడూ పక్కల వైపే వెళ్ళాలని సదా ప్రయత్నిస్తూనే ఉంటుంది. దాని వల్ల మహా సమస్యలు. వెరసి దుఃఖం. కాన చీమకి కూడా హాని చేయని మనస్తత్వం కలిగి వుండటమే మనఃశుద్ధి.



ఈ అయిదు శుద్ధులను కలిగి ఉండి కర్మలను చేస్తూ నడిచిన వారికి ధనం ద్వారా, భగవంతుని కృప ద్వారా కలిగే సకల సమస్త భోగాలూ, సుఖాలూ, కీర్తి కలుగుతాయని పద్మపురాణం శెలవిస్తోంది.

## గోపేడ ఎంత లక్ష్మీప్రదం

ఆవు వోమములో, నాలుకలో, కొమ్ములలో ఇంద్రుడున్నాడు. ఇంద్రియ ద్వారాలలో వాయుదేవుడున్నాడు. మూపురంలో శివుడు, పాదాలలో దేవతల సముదాయము. కడుపులో అగ్ని ఉన్నారు. ఇక పొదుగులో సరస్వతీదేవి, మూత్రంలో కీర్తి, రక్తంలో చంద్రుడూ, హృదయంలో భగుడు, పాలలో బ్రహ్మ ఉన్నారు. వెంట్రుకలలో ఆచార సముదాయమూ, తోకలో యముడూ, కన్నులలో సూర్యుడూ, చర్మంలో సిద్ధీ, తేజమూ, కీళ్ళలో అష్టసిద్ధులూ ఉన్నారు.

అట్టి గోమాతలో ఆదిలక్ష్మి ఆ శ్రీమహాలక్ష్మీదేవి గోపేడలో వుంటుంది. అందుకే సకల పూజాదికాల్లో గోమయంతో అలికి ఆపై పూజామందిరాన్ని ఏర్పరుచుకుంటారు.

# శుక్రవారం క్షీరాభిషేకం

శ్రీమన్నారాయణుడు క్షీరాభిషేక ప్రియుడు. అలాగే క్షీరనైవేద్యాలు అర్పించాలి. శుక్రవారం పూట క్షీరాభిషేకం చేసి పూజిస్తే విష్ణుసతి లక్ష్మీదేవి ధనరాసులను అందిస్తుంది. తిరుమలలో ప్రతిరోజూ క్షీరాభిషేకం, క్షీరనైవేద్యాలు పెట్టడం నేటికీ పరిపాటి. ఆ కైంకర్యము తొలుత లక్ష్మీదేవే స్వయంగా అనాదిలో చేయించినది. అదే నేటికీ కొనసాగుతోంది.

# వ్యాపారస్థులు ధనలక్ష్మి కంటే...

ఆరోగ్యలక్ష్మిని కాపాడుకోవాలి. ధనవెంత కుమ్మరించినా తిరిగిరానిది ఆరోగ్యలక్ష్మి. చిన్న అనారోగ్యమే కదాని నిర్లక్ష్యం చేస్తే అది లక్షలరూపాయలకి దారి తీయచ్చు. ఒక్కోసారి ధనంతో ఆరోగ్యాన్ని సరిదిద్దలేని పరిస్థితులు రావచ్చు. ధనం సంపాదించేది మీరు ఆనందంగా వుండటానికీ, మీ వాళ్ళని సంతోషపరచటానికి. ఆ సంపాదించిన ధనాన్ని ఆసుపత్రులకోసం, వెంటిలేటర్ల కోసం ఖర్చు చెయ్యటానికి కాదు. ధనాన్ని ఒక్కటే కాదు ప్రోగు చేయాల్సింది ఆరోగ్యాన్ని కూడా. అప్పుడే ధనం అనే రసాన్ని ఆస్వాదన చెయ్యగలరు.



# శ్రీవిష్ణుసహస్రనామం పఠిస్తే

ధర్మరాజుకి భీష్ముడు ఇలా చెప్పాడు.

'యుధిష్ఠిరా, శ్రీవిష్ణుసహస్రనామం అనుదినం వినేవారూ, చదివేవారూ సకల శుభాలను పొందుతారు. శత్రునాశనం జరుగుతుంది. వ్యాపారి ధన సంపదలు పొందుతాడు. కీర్తిని తెచ్చే సంతానం కలుగుతుంది. అనేక వ్యధలూ, రోగాలూ దూరమవుతాయి. శౌర్య, ప్రతాప, శోభ, శక్తి, సద్గుణాలతో విలసిల్లుతారు. దీర్ఘాయువూ, ఐశ్వర్యమూ, వైభవమూ, ఆరోగ్యమూ, జ్ఞానములు శ్రీవిష్ణుసహస్రనామాలను పఠించటం వల్ల కలుగుతాయి.

# ధనప్రాప్తికై ఏ ఏకాదశి పూజ చేయాలి

సకల తిథులలో ఏకాదశి విశిష్టమైనది. సాధారణంగా సంవత్సరంలో ఇరవై నాలుగు వస్తాయి. ఆయా మాసాల్లో వచ్చే ఏకాదశినాడు శ్రీలక్ష్మీనారాయణుల పూజాది వ్రతాలు చెయ్యటం వల్ల మహాధనప్రాప్తి కలుగుతుంది.

– వైశాఖ మాసంలో శుక్ల పక్షంలో మోహినీ ఏకాదశి చేయటం వల్ల అపార ధనప్రాప్తి.

– ఆషాఢమాసంలో వచ్చే దేవశమని ఏకాదశివ్రతం చెయ్యటం వల్ల సంపదలు వృద్ధి చెందుతాయి.

– భాద్రపదంలో వచ్చే ఇందిరా ఏకాదశి వ్రతం వల్ల ఆకస్మిక ధనప్రాప్తి.

– మాఘమాసంలో కామద ఏకాదశినాడు శ్రీలక్ష్మీనారాయణులను పూజించటం వల్ల సకల కార్యాల్లో విజయం, సిరి, సుఖాలు ప్రాప్తి.

– అధికమాసంలో వచ్చే ఐశ్వర్య ఏకాదశినాడు వ్రతం చేసిన వారికి అష్టైశ్వర్యమహాసిద్ధి.

ఏకాదశి తిథి శ్రీమహావిష్ణువుకి అత్యంత ప్రీతకరమైనది. ఆ తిథి నాడు శ్రీలక్ష్మీనారాయణులకి తులసీదళాలతో అష్టోత్తర పూజ చేస్తే కోరిన కోరిక శ్రీలక్ష్మీనారాయణులు సిద్ధింప చేస్తారని పురాణాలు చెబుతున్నాయి. తొలుత ఈ వ్రతాన్ని అంబరీషుడు చేశాడు.

దీపావళినాడు తప్పని సరిగా చెయ్యాల్సిన స్నానం తిలతైల స్నానం. అనగా నూవుల నూనెతో తలంటుకోవాలి. నరకచతుర్ధశి, దీపావళి నాడు శ్రీలక్ష్మీదేవి తిలతైలంలో ఆవహించి ఉంటుంది. ఆ రోజులలో తలంటి పోసుకోవటం వల్ల లక్ష్మీ కృప కలుగుతుంది.



## శ్రావణ శుక్రవారం ఎంత లక్ష్మీప్రదమైనది

ఈ శ్రావణమాస వ్రతాన్ని సాక్షాత్తు శ్రీమహాలక్ష్మీదేవి చారుమతీదేవికి ఉపదేశించింది.

శ్రావణమాసంలో శుక్రవారం, అదీ పౌర్ణమి ముందు వచ్చే శుక్రవారం అయితే మహా మహత్తు గలది.

వరలక్ష్మీ వ్రతం ధనకనకవస్తువాహనాదులను అనుగ్రహిస్తుంది.

## కుటుంబమంతటి యశస్సు ఆయుష్షు... సంపదల కోసం

గోదానం చెయ్యటమంటే అమృతదానం చేసినట్టే. మహా ఫలం కలుగుతుంది. ఈ రహస్యాన్ని బ్రహ్మదేవుడు ఇంద్రునికి చెప్పాడు.

'ఇంద్రా... ఐశ్వర్యాల కోసం, ఆరోగ్యం కోసం గోవును తగినవానికి దానంగా ఇవ్వాలి. ఆ గోవు కోసం వెచ్చించిన ధనం పవిత్రమైనది అయి వుండాలి. ధర్మసాధనల ద్వారా, శుభవృత్తుల ద్వారా సంపాదించినదై ఉండాలి. అలా కానిచో దానం వికటించి వ్యతిరేక ఫలాలను ఇస్తుంది.'

గోవును దానంగా ఇచ్చి ఐశ్వర్య ఫలాలనూ, శుభాలనూ, సౌఖ్యాలనూ పొందగలవారు బృహస్పతి మాంధాతకు చెప్పిన విధంగా గోవును దానంగా ఇవ్వాలి.

## కల్లుత్రాగటం వల్ల ధనలక్ష్మి ఎందుకు తరలిపోతుంది

మహాశివుడు పార్వతీదేవితో ఇలా చెప్పాడు. పాపాలన్నింటిలోనూ మహా పాపం కల్లు తాగటం. మద్యపానం వల్ల ప్రాణోపద్రవం కలుగుతుంది. కాన కాంతామణీ కల్లు మానటం వల్ల కీర్తి, సిరిసంపదలూ, పుణ్యలోకాలు కలుగుతాయి. శరీర సంబంధిత ఈ దోషం ద్వారా అష్టలక్ష్ముల్లో కొన్ని లక్ష్ములు తరలి వెళ్ళిపోతాయి.

## సత్యహరిశ్చంద్ర మహారాజు చెప్పిన లక్ష్మీదానం...

అన్ని దానాల్లోకెల్లా ఉత్తమమైనది త్రాగటానికి చేసే దానం. నేయి దానం అగ్నిదేవునికి ప్రీతి.

గొడుగును దానం చేస్తే సంతానం.

చెప్పులు దానంగా ఇస్తే శత్రునాశనం.

నువ్వులు దానం చేస్తే పగటి పూట చేసిన సంభోగదోషాలు పోతాయి.

అలాగే అగ్నిహోత్రాలలో అగ్నికి కట్టెలు దానం చేస్తే ధనంతో తులతూగుతాడు. ఇంకా బంగారాన్ని దానం చెయ్యటం ద్వారా (దేవాలయాలకు, దేవతామూర్తుల విగ్రహాలకూ) మహా ఆయుష్షును పొందుతాడు. అష్టభోగాలూ, భాగ్యాలూ పొందుతాడు.



## శ్రీమహాభారతములో అనుశాసనిక పర్వములో భీష్ముడు ధర్మరాజుకి చెప్పిన శ్రీలక్ష్మీస్థానాలు

ధర్మరాజు భీష్ముడిని లక్ష్మీ స్థానాలు ఏమిటని అడుగుతాడు. అంపశయ్యపైనున్న భీష్ముడు ఇలా చెప్తాడు.

గోలోకంలో శ్రీనారాయణుడి ఒడిలో సౌందర్యలక్ష్మిగా కూర్చున్న లక్ష్మిని చూసి రుక్మిణీదేవి తన పెద్ద కళ్ళని మరింత పెద్దవి చేసి భక్తితో అడిగింది. 'నీవు ఎలాంటి స్త్రీలలో, ఎలాంటి గృహాలలో, మగవారి వెంట ఉంటావు?' అని.

లక్ష్మీదేవి రుక్మిణికి చెప్పిందే నీకు చెబుతున్నాను ధర్మజా అని భీష్ముల వారు ఈ విధంగా చెప్పారు.

'ధర్మజా, లక్ష్మి అంటే ధనం ఒక్కటే కాదు. శుచీ, శుభ్రతా, సరళతా, అందం, వైభవం, పవిత్రత, ధర్మం, జ్ఞానం, సత్కర్మలే లక్ష్మి అంటే. అలాంటి లక్ష్మీదేవి తన ఆవాస స్థానాల గూర్చి చెబతూ... సత్యాన్నే పలికేవారిలో, శుచికలవారిలో, గురుభక్తులలో, మద్యం సేవించనివారిలో, కార్యసాధకులలో, స్వచ్ఛమైన మనస్సు గలవారిలో, మంచి పనులు చేసేవారిలో, ఇంకా జ్ఞానాన్ని పెంపొందించేవారిలో, తపస్సు, దానాలూ చేసేవారిలో, ఇంద్రియ నిగ్రహం కలవారిలో....

అటువంటి వారందరి గృహాల యందు నా నివాసస్థానమని శ్రీమహాలక్ష్మి చెప్పింది. ఇంకా తామరపూలతో నిండిన సరస్సులయందూ, చెట్ల పూలమొక్కల తోటల్లో నేను నివాసముంటాను.

నేనుండని ప్రదేశాలు.. నీచ స్వభావం కలవారి యందూ, దేవుణ్ని నమ్మని వారి యందూ, చేసిన సహాయం మరిచిన వారి యందూ, చెడుబుద్ధి కలవారి యందూ నేనుండను. భర్తని ఎదురించిన వారి యందూ, కఠినమైన మనస్సు గల స్త్రీ యందూ, కొంపల చుట్టూ తిరిగేవాని యందూ, ఎక్కువగా నిద్రపోయే వారి యందూ నేను ఉండలేను. ఉండను. నాకు నచ్చని వారు వారంతా.

స్త్రీలు గృహ నీతి తప్పి ప్రవర్తిస్తే ద్రోహుల కిందకు వస్తారు. అట్టివార్ని నేను అనుగ్రహించను అని ఆ వైకుంఠనాథుని సతి శ్రీమహాలక్ష్మీదేవి చెప్పింది ధర్మపుత్రా.'

## ఏ ఏ కార్యాలకి ఏ ఏ ఫలాలు

అలసిసొలసిన బాటసారికి భోజనం పెడితే వచ్చే పుణ్యం చెప్పుటకు వీలుకాదు. మౌనవ్రతం చేస్తే జ్ఞానశక్తి లభిస్తుంది. ధ్యానానికీ, తపస్సుకూ అధిక భోగం. బ్రహ్మచర్యానికి దీర్ఘాయువు. ఉపవాసానికి చిత్తశుద్ధి. ఇక లక్ష్మి సంపదలు అహింస వల్లే కలుగుతాయని భీష్ముడు ధర్మరాజుకి చెప్పాడు.



## స్వర్గలక్ష్మి ఎలా సిద్ధిస్తుంది

శరణన్న వారిని రక్షించటము. పేదకన్యకు వివాహం జరిపించటం. మంచి కార్యాలలో తన వంతు ధనాన్ని సమర్పించడం. బాటసారుల దాహార్తి తీర్చటం. నీరుత్రాగుతున్న జంతువులని బెదిరించటం వంటివి చేయకుండటం, పరవనితా సంగమంకై ఆశించకుండా ఉండటం ఇత్యాదివన్నింటిద్వారా స్వర్గలక్ష్మి సిద్ధిస్తుందని అనుశాసనిక పర్వం శెలవిస్తోంది.

**యంత్రాలూ, మంత్రాలూ, పూజలూ మహాలక్ష్మిని ఆహ్వానించగలవు - స్థిరనివాసాన్ని ఏర్పరచలేవు.**

**- విను, పురుషుడు గావింపని పనులకు దైవ మదియెట్లు, ఫలమొనరించున్**

అనగా మనుజుడు ఏ కార్యమూ చెయ్యకుండా దైవం మాత్రం ఏం చెయ్యగలదు. కార్యాలను చేస్తేనే ఫలములు రాగలవని శ్రీమహాభారతము సహితం చెబుతోంది.

# ఏ తీర్థం సేవించటం ద్వారా ధనం కలుగుతుంది

– కాళికాశ్రమంలో స్నానం చేసి సేవిస్తే కోపతాపాలు తొలగిపోతాయి.

– చిత్రకూట పర్వత ప్రాంతాలను సేవిస్తే అధికారం కలుగుతుంది.

– నైమిశారణ్యంలో నివసించి సేవిస్తే మహా యాగం చేసిన ఫలం కలుగుతుంది.

– గంగా యమునా సంగమస్థానంలో స్నానమాచరిస్తే మోక్షం సిద్ధిస్తుంది.

– ప్రయాగ తీర్థ సేవనం ముక్తిని కలిగిస్తుంది.

– నర్మదానదిలో స్నానం చేసి కోరుకుంటే మరుజన్మలో రాజకుమారుడై పుడతాడు.

– దేవదారువనంలో సేవించినవారికి మహా సుందరమైన భార్య లభిస్తుంది.

– జంబూనదిలో స్నానం సర్వసిద్ధులు కలిగిస్తాయి.

– వైవస్వత తీర్థాన్ని సేవిస్తే అష్టైశ్వర్యాలు కలుగుతాయి.

(గౌతముడు అంగీరసునితో చెప్పినవి)



# నిధులకి రక్షణగా నాగబంధం వేస్తారా

చక్రవర్తులూ, రాజులూ పూర్వము శత్రుసేనల నుంచి సంపదలను రక్షించటానికి దేవాలయులూ, బావులూ, కొండప్రాంతల్లోని సరస్సులనూ ధనాన్ని దాచటానికి ఎంచుకునేవారు. నేలమాళిగలు సృష్టించి అత్యంత రహస్యంగా సంపదలను దాచిపెట్టేవారు. అలా దాచిపెట్టే సంపద ఉన్న ప్రదేశ ప్రధాన ద్వారాలకి నాగబంధం వేసి నాగులను రక్షణ కవచాలుగా ఏర్పరిచేవారు. దాన్ని తీయాలంటే అప్పుడు ఏ మంత్రాలను పఠించి నిక్షిప్తం చేశారో, దానికి ఉపసంహారంగా ఆ మంత్రాలకి సంబంధించినవి పఠించాలి. ఆ సంపదలు కాలగర్భంలో ఇమిడిపోయినట్టే ఆ మంత్రాలూ కాలగర్భంలో కలిసిపోయాయి. ప్రస్తుతానికి అంత మంత్రసిద్ధులు లేరు.

కాన ఆ నిధులు శ్రీమహాలక్ష్మీదేవే తగు కారణాలతో వెలుగులోకి తెస్తుంది. అలా ఆ ఆదిలక్ష్మి కటాక్షం వల్లే తిరువనంతపురంలో అనంత పద్మనాభస్వామి అనంత సంపద వెలుగులోకి వచ్చింది.

## ఆవుపేడలో శ్రీలక్ష్మి ఎందుకుంటుంది

ఓసారి మహాలక్ష్మి గోవుల మంద వద్దకెళ్ళింది. నేను శ్రీమహాలక్ష్మిని మీతో కలిసి వుండాలని కోరుకుంటున్నాను అన్నది. దానికి గోవులు నీ సన్నిహిత్యము మాకూ ఇష్టమే కాని నీవు చంచలవీ, చపలవి. నీకిష్టం లేకపోయినా, నీకు నచ్చకపోయినా నీవు వెళ్ళిపోతావు. గాన నీకు ఆశ్రయం ఇవ్వాలంటే స్థిరంగా వుండాలి అన్నాయి. దానికి శ్రీలక్ష్మి ఒప్పుకుంది. మా మలమూత్రాలు పరమ పవిత్రాలని వేదాలు శెలవిస్తున్నాయి. అందు నీ నివాసం ద్వారా ఐశ్వర్యప్రాప్తినీ, శుభాలు కూడా కలుగుతాయి. కావున వాటి యందు ఉండి తద్వారా చేసే పూజల ద్వారా నీ భక్తులని కటాక్షించవచ్చు అన్నాయి. గోశ్రీసంవాదంలో ఈ మహత్యం గూర్చి తెలుపబడింది.

**రాత్రి ధరించిన దుస్తులనే మరుసటి రోజున కూడా ధరించి కార్యకలాపాలను చేస్తే ఆ దోషం ఎనిమిదిరోజులు ఉండి అన్నీ నష్టాలనే కలిగిస్తుంది.**



## ఏ వర్ణం గలగోవును దానం ఇస్తే అపార సంపదలు

గోవు చెవులు, కొమ్ములు, కన్నులు, గిట్టలు, ముక్కులు, మెడ, అండాలు కపిల వర్ణంలో ఉండాలి. పైవాటిల్లో ఏ శరీర భాగమైనా కపిల వర్ణంలోనున్న చాలును. కపిల గోవు ఆవు పాలు పిండరాదు. అట్టి ఆవులను దానమిచ్చిన మహా సంపదలూ, పుణ్యం లభిస్తాయని వ్యాసుడు శుకునికి చెప్పాడు.

## పూజా మందిరంలో నెమలి పింఛం వాడటం వల్ల....

పూజా మందిరాన్ని శుభ్రం చేసేటప్పుడు దేవతా మూర్తులకు వినియోగించిన పూవులు వంటివాటిని చేతులతో కాకుండా నెమలి పింఛమును వాడుతూ తీయటం శుభకరం. నెమలి పింఛమును వాడటం శుభకరం, లక్ష్మీప్రదం.

నెమలిపింఛము వాడటానికి కారణం.. శుద్ధమైనది, స్వచ్ఛమైనది. ఎలాంటి అంటూ, దోషం అంటనిది. అందుకే చేతులతో శుభ్రం చెయ్యకుండా నెమలిపింఛం వాడాలి. బెడ్‌రూమ్‌లో నెమలిపింఛం కనపడేలా ఉంచుకుంటే ధనలాభం. సౌఖ్యం.

## బంగారు శ్రీమహావిష్ణువు ప్రతిమను పూజించటం వల్ల

– ధనం తరతరాలకీ అందుతుంది.

– మహాకీర్తి సంతానానికి వస్తుంది.

– వారి గృహంలో సుఖాలకీ, శాంతికీ, ఆనందాలకీ కొదవ ఉండదు.

– కలిగే సంతానం పూర్వీకుల దారిలో ప్రయాణిస్తూ వందల సంవత్సరాల పర్యంతము పూర్వీకుల కీర్తిని దిగ్దిగంతాలకి వ్యాపింప చేస్తుంది.

– బంగారు ప్రతిమ శ్రీమహావిష్ణువును పూజించటమంటే సాక్షాత్తు శ్రీమహాలక్ష్మీదేవి కూడా మీతో పూజాదికాలు నిర్వహిస్తున్నట్టే.

– పూర్వము చక్రవర్తులూ, రాజులూ వారి వారి పూజామందిరాల్లో బంగారు విగ్రహాలనే పూజించేవారు. అలా పూజించటం వల్ల ప్రజలకి లేమి అన్నది వుండదని ఆ విధంగా ఆచరించేవారు.

## శ్రీలక్ష్మీదేవికి పంచదారతో (తీపి ద్రవపదార్థాలు) అభిషేకం చేయటం ద్వారా దీర్ఘాయువూ, ఆరోగ్యం కలిగి వ్యాధులు దూరమవుతాయి.



## నిత్య ధనాభివృద్ధికి

నిత్యం తులసీపూజ అమితమైన ధనాన్నీ, సౌభాగ్యాన్నీ ఇస్తుంది. శ్రీలక్ష్మి పూజ చేసి ఆ అక్షితలను తలసి కోట మొదట్లో వేసి స్తుతించటం ద్వారా ధనమూ, సౌభాగ్యమూ కలుగుతాయి. ధనాన్ని నిరంతరం రక్షించేది తులసి చెట్టే. అందుకే ప్రతి గృహంలో తులసికోటను ఉంచి పూజిస్తారు.

## ఎలాంటి ధూపం శ్రీమహాలక్ష్మికి ప్రీతకరము

అందుగు చెట్టు ధూపం, రావి చెట్టు బెరడు ధూపం ప్రీతికరమైనది.

గుగ్గిలం గంధర్వులకూ, యక్షులకూ ఇష్టం.

గంధపుపొడి, అగరు, సాంబ్రాణిని వేడుకల్లో ధూపంగా వేయాలి. అది కూడా పసిపిల్లలకి సంబంధించిన శుభకార్యాల్లోనే వాడాలి. మహా సౌభాగ్యాలనీ, సంపదలనీ ఇచ్చే లక్ష్మి ధూపం కర్పూర ధూపం. శ్రీమహాలక్ష్మికి ఈ కర్పూర ధూపం ఇవ్వటం వల్ల మహా ధనసిద్ధి కలుగుతుంది.

## ఎలాంటి పూలు శ్రీమహాలక్ష్మికి ప్రీతికరము

– మంచి వాసన కలిగినవీ, మంచి రూపము కలిగినవీ, తెల్లదనం కలిగి ముళ్ళు లేనివి.

– తామరలు, జాజులు, తులసీదళాలు.

– నీటి నుంచి వచ్చినవి యక్షులకి ప్రీతికరములు.

– ఎర్రనివీ, ముళ్ళనుంచి పుట్టినవీ, మహా వాసన కలవీ క్షుద్ర పూజలకి వాడతారు. రాక్షసులకి ప్రీతికరములు.

– నలుపూ, తెలుపులతో ఇంకా పచ్చని వన్నె కలవీ, మంచి సువాసన కలవీ మనుజులకి ఇష్టము.

– దేవాలయంలో పూసిన పూలను బైటికి తీసుకురాకూడదు. స్త్రీలు వాడకూడదు. అది లక్ష్మీ దోషము.

(పుష్పాల ఫలాల గూర్చీ, ఫలితాల గూర్చీ శుక్రాచార్యులవారు బలికి, అతడు మనువుకి, ఆతడు సువర్ణుడికి ఆతడు నారదునికి చెప్పినవి)

**పోయిన మహా మహా ధనం, సంపద, కీర్తి తిరిగి పొందాలంటే అరుణ హోమం చెయ్యాలని హోమ విధానం తెలవిస్తోంది.**



## ఆహోబిలంలో రాయలవారి అపార సంపద ఉందా

– అహోబిలం ఆరవ పీఠాధిపతి శ్రీకృష్ణదేవరాయలు సమర్పించిన వజ్రకిరీటం పెట్టుకొని నేలమాళిగలో సజీవ సమాధి అయ్యాడని అక్కడి పూజారులు చెబుతున్నారు.

– అహోబిలం నరసింహస్వామి ఆలయ పాదాల చెంత మహా సంపద వుందనీ అది రాయలవారు దాచి పెట్టారని స్థానికుల వాదన.

– గతంలో త్రవ్వటానికి ప్రయత్నిస్తే మహా విషపురుగులు వచ్చాయనీ, దాని వల్లే ఆపేశారనీ స్థానికులు చెబుతున్నారు.

– పూర్వం నిధులూ, నిక్షేపాలూ దాచిపెట్టే వారు భయంకర విషసర్పాలనూ, తేళ్ళనూ, మండ్రగబ్బలనూ ఉంచి దాచేవారు. అలాగే భయంకర విషవాయువులను కూడా నిధి ఉన్న గదిలో నిక్షిప్తం చేసేవారు.

– నిధి నిక్షేపాల ఉనికి తెలియకుండా వుండటానికి ఆ రోజుల్లోని అనేక రసాయనాలు వాడి పటిష్ఠ పరిచేవారు. దానివల్లే ఎంత టెక్నాలజీ ఉపయోగించినా నిధి గూర్చి తెలుసుకోలేము.

– బ్రిటీషు వారికీ, శత్రువులకీ జాతి సంపద అందకూడదని ఎందరో రాజులు అలా భూమిలో నిక్షేపాలు చేసినట్టు చరిత్రలో ఆధారాలున్నాయి.

# సమస్త వైభోగాల కోసం ఉపవాసాలు

– ఉపవాసం ఉండటం వల్ల యజ్ఞం చేసినంత ఫలం వస్తుంది.

– పూర్ణిమ, శుక్లపక్ష అష్టమి, చతుర్థశి తిథుల యందూ, శుక్లకృష్ణ పక్షాలలో షష్ఠి, పంచమీ తిథుల యందు ఉపవాసాలు మహా ఫలితాన్నిస్తాయి.

– ఒంటిపూట భుజించి వ్రతం చెయ్యటం ద్వారా మంచి అందమైన భార్య లభిస్తుంది. గుణవంతులైన సంతానం కలుగుతారు.

– అదే సంవత్సరకాలం చెయ్యటం ద్వారా మనుజుడు మానవలోకంలో పొందాల్సిన సకల వైభోగాలూ, సంపదలూ, సుఖాలూ పొందగలడు. ఉపవాసాల వల్ల దుఃఖం దూరమవుతుంది.

– ఉపవాస వ్రతాన్ని మించిన తపస్సు లేదు.

– విశ్వామిత్రుడు తను సాధించాల్సిన కార్యాన్ని వేయిఏండ్లు ఏ రోజూ విఘాతం కలుగకుండా ఉపవాస వ్రతాన్ని చేసి అనుకున్నది సాధించాడు.

– పగటిపూట ఓసారి, రాత్రిపూట ఓసారి మాత్రమే భుజించి మధ్యలో ఏమీ తీసుకోకుండా చేసే వ్రతం వల్ల మంచి శుభాలు కలుగుతాయి.

– ఎంగిలి చేత్తో సూర్యుణ్నీ, చంద్రుణ్నీ చూడరాదు. ఫలితం ధనహీనత.. ఆరోగ్యహీనత.



# అందచందాలకూ, ఆయుష్షుకూ, ఐశ్వర్యానికి

మాంసాహారం వలదని స్వాయంభువమనువు, మార్కండేయుడు వంటి వారు లోకానికి తెలియచెప్పారు. మాంసాన్ని భుజియించటం మానితే సకల హింసలను మానినట్టే. మాంసం తననెవరు నములుతున్నదో, వారిని తను నములుతుంది. మాంసం మానితే అది ఒక తపస్సుతో సమానమని ఆగమము చెబుతోంది. ఇంకా మాంసభోజనాన్ని వదిలితే అశ్వమేధయాగ ఫలం వస్తుంది. యజ్ఞయాగాదులలో చేసే మాంస భోజనం తీసుకోవటం వల్ల ఎలాంటి దోషం లేదు. మాంసపు రుచి తెలియనివారికి తెలియ చెప్పటం మహా పాపం. మాంసాన్ని వదిలితే అందం కలుగుతుంది. ఆయుష్షు వృద్ధి చెందుతుంది. వాటితో ఐశ్వర్య సిద్ధి కలుగుతుంది.

పూర్వము మహారాజులైన క్షత్రియులు సహితం మాంసాహారాన్ని క్షత్రియ ధర్మం ప్రకారమే తీసుకునేవారు. ఉదాహరణకు సగరుడు, దిలీపుడు, నృగుడు, భగీరథుడు ఇత్యాది మహాత్ములెందరో. వారంతా వర్షాకాలం నాలుగు నెలలు మాంసాహారాన్ని మానివేసేవారు.

ఇన్ని చెప్పిన ధర్మశాస్త్రం మాంసాన్ని ఎప్పుడు తీసుకోవచ్చో కూడా చెప్పింది. యజ్ఞ యాగాదుల యందు, సంబంధిత గృహకార్యాలప్పుడూ, గ్రామదేవతాది ఉత్సవాలయందూ చేసే అనేక శాస్త్ర విధుల్లో తీసుకోవటం తప్పు లేదని చెబుతోంది.

## సకల ఔషధాల్లో లక్ష్మీదేవికి ప్రీతికరమైనవి

ద్రవాల్లో ఆవుపాలు... కాయల్లో కొబ్బరికాయ, పత్రాల్లో బిల్వపత్రములు, పూలల్లో పద్మం, ఫలాల్లో అరటిపండు, ఆయనాల్లో ఉత్తరాయణం, మాసాల్లో శ్రావణం, పక్షాలలో శుద్ధం, తిథుల్లో తన భర్త శ్రీమహావిష్ణువుకి ప్రీతికలిగించే ఏకాదశి, వారాల్లో శుక్రవారం ముఖ్యంగా శ్రావణ శుక్రవారము... వనాల్లో పోకచెట్ల వనాలు, వాహనాల్లో గజము, ధూపాల్లో కర్పూర ధూపం, ఇంకా జవ్వాది కూడా. ఇక నైవేద్యాలల్లో పొంగలి, వస్త్రాలలో తెలుపు, పసుపు పట్టు వస్త్రాలు అత్యంత ఇష్టమైనవి. అటూ ఇటూ ఏనుగులు అభిషేకిస్తుంటే పట్టు చీరకట్టుకొని పద్మంలో కూర్చున్న పటాన్ని, ప్రతిమను పూజించటం ఆ సంపదల తల్లికి మరింత ప్రీతికరమైనది. అలాగే గృహంలో లక్ష్మీదేవి ఒక్కతే వున్న పటం వుంటే గృహంలో ఎక్కడైనా శ్రీమహావిష్ణువుతో కలిసి వున్న లక్ష్మీదేవి పటం కూడా ఉంచాలి.



## దీపారాధన దీపం ఎలా ఉండాలి

– నేయి పూర్తిగా ఉండాలి. వత్తి బలంగా వుండాలి.

– దేవాలయంలో, కొండల మీద దీపాన్ని వెలిగిస్తే ధనలాభం, ఐశ్వర్య సిద్ధి.

– దీపానికి ఆవు నెయ్యి శ్రేష్ఠం. నువ్వుల నూనె మధ్యమం.

– క్రొవ్వు, కల్తీ జరిగినవి అధమం.

## పరమేశ్వరుడు, పరమేశ్వరికి చెప్పిన లక్ష్మీ రహస్యాలు

– తమ వద్ద ధన నిల్వలు లేకున్నా సకలం సమకూరుతూ సుఖంగా గడుపుతుండే వారు గతజన్మలో తాము పేదవారైనా అందులోంచి ఎంతో కొంత ధనం దానం చేసినవారు. దాని వల్ల సుఖాలను పొందుతున్నారు.

– గత జన్మలో పక్కవారు చెప్పారనీ, బావుండదనీ మంచి పనులు చేసిన వారు ఈ జన్మలో సకల సంపదలుండి కూడా తినటానికి నోచుకోని వారు.

– ఏ మాత్రం శ్రమ లేకుండా శ్రీమహాలక్ష్మీదేవి గృహంలోకి వస్తుందంటే గత జన్మలో మహా యోగ్యాతియోగ్యమైన కార్యాలు చేసినవారు.

– ఎంత కష్టపడ్డా ధనం రాకపోవటానికి కారణం గతజన్మలో పరులను రేపూ, మాపూ, ఎల్లుండి అని అనేక రకాలుగా ధనమివ్వకుండా హింసపెట్టిన వారై వుంటారు.

– ముసలి తనంలో ధనం రావటమంటే అనగా వయసైపోయిన తర్వాత ధనం రావటమంటే గతజన్మలో యవ్వనంలో ధనం గూర్చి చెయ్యకూడని పనులన్నీ చెయ్యటమే కాక శక్తి కొలది అడ్డు పడిన వారై వుంటారు.

– మహా ధనరాసులున్నా రోగాలతో బాధపడేవారు గతజన్మలో రోగగ్రస్థులని కూడా చూడకుండా ధనాన్ని ఇవ్వని వారే.

– ఏ జ్ఞానమూ లేకపోయినా మహా సంపద కలిగిన వాడయితే అట్టి వాడు గతజన్మలో వివేకహీనయై ఉండి కూడా అన్నార్తులను ఆదుకున్నవాడే అయి వుంటాడు.

– రోగాలూ, రొప్పులూ లేకుండా భార్యా పిల్లలతో ఆనందంగా వైభవోపేతంగా కూడా గడిపే వారు గత జన్మలో ధర్మపరులు, ఆచారపరులు అయి వుంటారు.

పాపాలు నశించటానికే పూజలు, వ్రతాలు, నోములు, యజ్ఞాలు, యాగాదులూ, ధర్మప్రచారాలు చేయాలి. **(పద్మపురాణం ఆధారంగా)**



## సంపద కలిగించే కైకేయీ, శాండిలిల సంవాదం

సకల వైభోగాలతో, తేజస్సుతో అమరావతిలో శాండిలి వెలిగిపోతుండటం చూసి ఇంతటి మహా అదృష్టం ఎలా కలిగిందని కేకయి రాజపుత్రి సుమన అడిగింది.

శాండిలి ఇలా చెప్పింది.

– అత్తమామలకు ఎదురు చెప్పను.

– పదుగురి ఎదుట పకపక నవ్వను.

– ఇల్లంతా పరిశుభ్రంగా ఉంచుతాను.

– భర్త పని, పిల్లల పని క్షణం కూడా అశ్రద్ధ చెయ్యను.

– ధనాన్నీ, ఆహార వస్తువులనూ వ్యర్థం చేయను.

– దేవపూజలూ, వ్రతాలూ, నోములు విధిగా చేస్తాను.

– భర్తకు ఇష్టమైనవే చేసి పెడతాను.

– కామభావాన్ని అదుపులో ఉంచుకుంటాను.

– **గృహిణీ గృహ ముచ్యతే** అనగా ఇల్లాలే ఇల్లు.. సకల బాధ్యతలనూ నిర్వహిస్తాను. దాని వల్లనే ఈ మహా వైభోగాలు అని చెప్పింది. (ఇది చదివిన వారికి సంపద కలుగుతుందనీ, ఆయువు పెరుగుతుందనీ అనుశాసనిక పర్వంలో చెప్పబడింది.)

## గో తులాభారం ఎంతటి ధనప్రాప్తిని కలిగిస్తుంది

గోవు బరువుతో ధాన్యాన్ని తూచి వాటిని పేదవారికి దానంగా ఇవ్వటం వల్ల ధనలక్ష్మి నడుచుకుంటూ మీ గృహంలో కాలుపెడుతుంది. అంతేకాదు అలా గోతులాభారం తూచి ధాన్య దానాలు చెయ్యటం ద్వారా మీ పూర్వీకుల ఆస్తి మీకు వస్తుంది. అడ్డంకులన్నీ చెదిరిపోతాయి. మహా నిధి నిక్షేపాలు తీయాలనుకున్న వారు వారి పూర్వీకులను తలచుకుని గోతులాభారం తూచి దానం చేసి ఆపై నిధి కోసం ప్రయత్నించడం (వారి పూర్వీకుల ధనం కొరకు) ఆనవాయితి.

## ఏ పూల అలంకరణ ఎంతటి లక్ష్మీ ప్రాప్తిని కలిగిస్తుంది

మారేడు పుష్పములు అలంకరించి పూజించటం ద్వారా సర్వసంపదలు కలుగుతాయి. మోదుగ పూలతో పూజించటం ద్వారా కోరిన కోర్కెలు తీరతాయి. అవిశ పుష్పాలతో పూజ కీర్తిప్రతిష్ఠలు. జాజిపూల పూజ ద్వారా వాహన యోగమూ, మంకెన పూల పూజ ద్వారా ఆభరణాల ప్రాప్తి. అడవిమల్లెల ద్వారా స్వగృహప్రాప్తి కలుగుతుంది.



## పద్మతీర్థంలో స్నానం ఎంతటి లక్ష్మీప్రదం

పద్మతీర్థం అనగా తామర సరస్సులో స్నానం చేసి శ్రీమహావిష్ణువుని దర్శించి సేవించి మనోవాంఛలు కోరుకుంటే తక్షణం ఆ కోరిక తీరుతుందని పద్మపురాణం శెలవిస్తోంది. గృహంలో అయితే తామర పూలు కలిపిన నీటిలో స్నానం చేసి శ్రీలక్ష్మీనారాయణులను పూజించి నైవేద్యంగా కొబ్బరి చిప్పలో అన్నం అలాగే దానితో పాటు మామిడి ముక్కను అర్పిస్తే మహాలక్ష్మి దీవిస్తుంది. లక్ష్మీప్రదం కలిగి అపార సిద్ధి కలుగుతుంది.

## ధనప్రాప్తికి ఏ ద్రవ్యముతో అభిషేకించాలి

బిల్వదళాలు మహాశివునికే ప్రీతికరములు కాదు మహా విష్ణువుకీ, లక్ష్మీదేవికి కూడా. బిల్వదళాలు లక్ష్మీదేవి నివాసస్థానం. ఆ బిల్వదళాలతో శ్రీమహావిష్ణువుని పూజించటం ద్వారా సంపదలు వృద్ధి అవుతాయి. అలాగే అభిషేకాలలో ఆవునెయ్యి అభిషేకం ద్వారా ఐశ్వర్యప్రాప్తి, కొబ్బరి నీటితో సర్వసంపదలు. సంపదలంటే ధనమొక్కటే కాదు. సుఖం, ఆరోగ్యం, గౌరవం, కీర్తి ఇత్యాదివన్నీ కలిస్తేనే, అనుభవిస్తేనే సకల సంపదలూ పొందినట్టు. చెరకురసాభిషేకం ద్వారా దారిద్ర్య నాశనమూ, అంటే



ధనం లేకపోవటము. కుచేలుడూ, సత్యహరిశ్చంద్రుడూ, చారుమతీదేవి నలదమయంతులు వంటి పుణ్యమూర్తులే దారిద్ర్యాన్ని తట్టుకోలేకపోయారు. మనవెంత. చెరుకురసంతో అభిషేకం చెయ్యటం ద్వారా లేమి అన్నది గృహంలో ఉండదు. అలాగే గంధము నీటితో అభిషేకం చెయ్యటం ద్వారా సౌభాగ్యములతో పాటు అపార సిరి, ఇంకా మంగళప్రదము కూడా.

## అత్యాశ అసలుకే మోసం

ఆశ ఉండటంలో తప్పు లేదు. అయితే అత్యాశ మహావినాశనాన్ని కలిగిస్తుంది. ఓ గ్రామంలో ఓ పేద రైతు గుడిశె వర్షానికి పడిపోయింది. దాంతో ఏం చెయ్యాలా అని దిగులు పడుతుంటే, పక్కనున్నవాడు ఓ సలహా ఇస్తాడు.

రాజ్యాన్ని ఏలే రాజు గుణవంతుడు, దయామయుడు. కాన నీవు వెళ్ళి ఆయన్ని అర్థించు. తాటాకులూ, వెదురు బొంగులూ ఇస్తాడని.

దాంతో ఆ రైతు నగరికి బైలుదేరతాడు. మార్గమధ్యంలో తెలిసిన వ్యక్తి కనపడి ఎక్కడికి అని అడుగుతాడు. విషయం చెబుతాడు రైతు.

ఓయీ పిచ్చోడా! రాజుగారిని అడిగేది అదా, శుభ్రంగా ఇటుకలూ, వాసాలూ అడుగు. మిద్దె వేసుకోవచ్చు అని చెప్పటంతో రైతు అలాగే నిర్ణయించుకుని ముందుకు కదులుతాడు.





కొంతదూరం వెళ్ళాక మరొకరు కనిపించి ఏంటి విషయం అని అడుగుతాడు. తాను రాజును కలవబోయే విషయం చెబుతాడు. అతను గట్టిగా నవ్వి రాజ్యాన్ని ఏలే రాజుని అడిగేదా అదా... నగలూ, నాణ్యాలూ అడుగు అని చెబుతాడు. రైతు కూడా అది నిజమేననుకొని ఎట్టకేలకు రాజును కలుస్తాడు. 'ఏం కావాలో కోరుకోమంటాడు' రాజుగారు. మిద్దెలూ, నగలూ, నాణ్యాలెందుకు రాజ్యమే అడిగితే పోలా అనుకొని 'రాజ్యం కావాలని' చెబుతాడు.

రాజు నవ్వి అయితే సూర్యాస్తమయం వరకూ సమయం ఇస్తున్నాను.. ఎంత దూరం పరిగెత్తి తిరిగి వస్తావో అంత రాజ్యం ఇస్తానని చెబుతాడు. దాంతో పరుగు ప్రారంభించాడు. చాలాసేపయ్యాక మరో వ్యక్తి ఎదురుపడి ఎక్కడిదాకా, దేనికాపరుగు? అని అడగటంతో విషయం చెబుతాడు.

"పిచ్చోడా! సూర్యాస్తయమం లోపు తిరిగి కూడా రావాలని చెప్పాడు. అయినా ముందుకెళ్తున్నావేమిటి' అని అడగటంతో నాలుక కరుచుకుని వెనక్కి తిరుగుతాడు. సమయానికి వెళ్ళాలని ఆదుర్దాతో పరుగులు తీసి రాజును చేరి కాళ్ళ మీదపడి ప్రాణాలు పోగొట్టుకుంటాడు. 'వీడికి ఆరడుగుల నేల చాలు.. ఈ అత్యాశ పరుడుని ఆ స్థలంలోనే పెట్టి కప్పేయండి' అంటాడు. కాన అత్యాశ అసలుకే మోసం తెస్తుంది.

## అష్టైశ్వర్యాలపై తెలుగువారి తెలుగు సామెతలు

– అంగట్లో అష్టభాగ్యం.. అల్లునినోట్లో శనేశ్వరం

– అదృష్టవంతుణ్ని చెరిపేవారు లేరు, దురదృష్టవంతుణ్ని బాగు చేసేవారూ లేరు.

– అప్పులేనివాడు అధిక సంపన్నుడు, మహా బలవంతుడు.

– అప్పిచ్చి చూడు, ఆడపిల్లనిచ్చి చూడు.

– అలకాపురి కొల్లగొట్టినా అదృష్టహీనులకేమీ దక్కదు.

– ఇచ్చేవాడు తీసుకునేవాడికి లోకువ.

– ఈ నెలలో వడ్డీలేదు, వచ్చే నెలలో అసలూ లేదు.

– ఐశ్వర్యానికి అంతం లేదు, దారిద్ర్యానికి మొదలు లేదు.

– ఒక్కోరాయీ తీస్తుంటే కొండయినా కరుగుతుంది.

– 'ఓ'నామాలు రాని వాడు వడ్డీలు గుణించినట్టు.

– కలిగినయ్యా కలిగిన దానికే పెడతాడు, లేనయ్యా కలిగినదానికే పెడతాడు.

– కలిగిన వారి కోడలు కులుకు మానదు.

– కలలో భోగం కలలో సరి.

– కుక్కను సింహాసనము మీదుంచినా వెనకటి గుణం ఎక్కడికి పోతుంది.

– కుడిచేత్తో ఇచ్చి ఎడమ చేత్తో తీసుకున్నట్టు.



– నడమంత్రపు సిరికి నెత్తి మీద కళ్ళు.

– పాసిపండ్లమ్మ సంపాదిస్తే బంగారు పండ్లమ్మ ఖర్చు పెట్టినట్టు.

– పుణ్యం కొద్దీ పురుషుడు, విత్తం కొద్దీ వైభోగము.

– బండెడు ధనమిచ్చినా బావమరిదిలేని చుట్టరికం పనికిరాదు.

– రవ్వరవ్వతో తెగుతుంది గాని రాతితో తెగుతుందా?

– వ్యాపారం జోరుగా సాగుతోంది, రెండో బట్టను అమ్మి డబ్బు పంపమన్నాడట.

– శనీశ్వరునికి నిద్ర ఎక్కువ, దారిద్ర్యానికి ఆకలెక్కువ.

– స్నేహితునికి అప్పు ఇస్తే రెండూ పోతాయి.

**నెలలో వచ్చే అష్టమీ, చతుర్ధశి, పున్నమి, అమావాస్య, రవి, సంక్రాంతి తిథులలో భార్యతో సంగమం చేయటం ద్వారా కలిగే సంతానం మహా కష్టాలనూ, దరిద్రాలనూ అనుభవించాల్సి వుంటుంది.**

## మాటిచ్చే ముందు వెనుకా ముందూ చూసుకోండి

ధనం విషయంలో నష్టపోయేది ఎక్కుసార్లు ఈ విషయంలోనే. పదిమంది ముందూ మెప్పుకోసం గానీ, అతి నమ్మకంతో గానీ సరేలే అంటారు. ఆ తర్వాత మాటిచ్చామని చేసేస్తారు. తద్వారా ధన నష్టమే. అలాంటి విషయంలో పార్వతీ పరమేశ్వరులే తమ గృహాన్ని పోగొట్టుకున్నారు.

పరమేశ్వరుని ఇల్లాలికి చక్కని ఇల్లు కట్టుకోవాలనిపించింది. దాంతో ఎంతో ఆలోచనతో, అభిరుచితో మహా వైభోగంతో గృహాన్ని భర్త చేత కట్టించింది. గృహప్రవేశాన్ని చేయించేందుకు రావణ బ్రహ్మను పిలిపించింది. దశకంఠుడు గృహప్రవేశ కార్యక్రమాన్ని నిర్వహించాడు. ఆ గృహాన్ని చూసి దేవాదిదేవతలంగా పార్వతీదేవిని అభినందించసాగారు. పార్వతి కూడా ఎంతో సంతోషించింది. గృహస్థ విధిని చక్కగా చేసినందుకు రావణబ్రహ్మను 'ఏం కావాలో కోరుకో' అంది. రావణబ్రహ్మ అందర్నీ చూసి ...'ఈ ఇల్లు కావాలన్నాడు'. దాంతో పార్వతీదేవి ఆ గృహాన్ని సమర్పించక తప్పలేదు.

కాన గమనించండి... తొందరపడి సరేలే, చేస్తానులే, ఏం కావాలో చెప్పు అని కమిట్ అయితే ఎక్కువసార్లు అది ఇబ్బందిగానే కాక మహా ధన నష్టంగా కూడా మారవచ్చు.



## స్త్రీలకు అందంతో పాటు ధనమూ వుండాలి

మహిళలకు ప్రతి సంవత్సరం చేసే వరలక్ష్మీ వ్రతంలో చారుమతీదేవి గాథ గుర్తు ఉండే వుంటుంది. మహాశివుడు పార్వతీదేవికీ, కుమారస్వామికీ చెప్పిన ఆ గాథలో చారుమతీదేవితో వరలక్ష్మీదేవి వ్రతం చెయ్యటానికి ఆ వూరి మహిళలంతా కలిసి చేస్తారు. వచ్చేటప్పుడు ఎవరికి వారు ఒక్కరే వస్తారు. వ్రతమయ్యాక ప్రదక్షిణ చేస్తుంటే పట్టు వస్త్రాలూ, మహా ఆభరణాలనూ ఆ వరలక్ష్మీదేవి వారికి అనుగ్రహిస్తుంది. వ్రతం పూర్తయ్యాక చూస్తే వారి వారి భర్తలు వారి భార్యలను తీసుకెళ్ళటానికి రథాలతో సిద్ధంగా వుంటారు.

కాన ఆ గాథని లోతుగా విశ్లేషించకుండా ఆలోచించండి. స్త్రీకి అందమూ, వినయం, అనుకూలతలతో పాటు ధనం కూడా వుంటే ఆ భర్త ఆమె కొంగు పట్టుకు తిరుగుతాడు.

## శమీవృక్ష స్తుతి

శమీ శమయతే పాపం శమీ శత్రు వినాశనీ
ధారిణ్యర్జున బాణానాం రామస్య ప్రియదర్శినీ.

**సూర్యభగవానుణ్ని శతనామస్తోత్రాలతో పూజిస్తే అక్షయసిద్ధి కలుగుతుంది. ధౌమ్యుని ఉపదేశంతో అలా పూజించే ధర్మరాజు సూర్యదేవుని వద్ద నుంచి అక్షయ పాత్రను పొందాడు.**

## ధనమదం... అధికార మదం మహాపతనము

చేతినిండా ధనమూ, అండగా పెద్ద స్థాయిలో వాళ్ళున్నారు కదాని విచ్చల విడిగా, అహంకారంగా ప్రవర్తిస్తే సకల ధనాలూ దూరమవుతాయి. మదం చేసిన పనులకి ఏ స్థాయిలో వాళ్ళయినా రక్షించలేరు. అలాంటి మదంతోనే కుబేరుని పుత్రులు నారదుణ్ని అవమానించారు, అవహేళన చేశారు. తత్ఫలితంగా మద్ది చెట్లురూపం దాల్చి ద్వాపర యుగంలో శ్రీకృష్ణుడు జన్మించి తమ శాపాన్ని పోగొట్టేదాకా చెట్ల రూపంలో గడపాల్సి వచ్చింది. మహా వైభోగాలను కలిగినవారూ, కుబేరునికే పుత్రులైన వారు ఎండకు ఎండుతూ, వానకు తడుస్తూ, చలికి వణుకుతూ చెట్ల రూపంలో శిక్ష అనుభవించాల్సి వచ్చింది. కాన ఆ రెండు మదాలనూ అదుపులో పెట్టుకోవాలి.



## పొయ్యి లక్ష్మీ స్వరూపం

పూర్వకాలంలో ఆహారాన్ని తయారు చేసే ముందు పొయ్యికి పసుపు, కుంకుమలతో బొట్టు పెట్టి ఆపై వంట చేసేవారు. దానికి కారణం బ్రతకటానికి కావలసింది ఆహారం. ఆ ఆహారం ద్వారానే శక్తి వస్తుంది. దాని ద్వారానే మనం ప్రతికార్యమూ చెయ్యగలుగుతాము. తద్వారా ధనమొస్తుంది. ఆ ధనం ద్వారా సుఖాలొస్తాయి. అలాంటి పొయ్యి నుంచి మంట తీసుకొని ధూమపానం కోసం వినియోగించటమూ, ఇంకా స్నానం చెయ్యకుండా పొయ్యిని ముట్టుకోవటం లక్ష్మీ సంబంధిత దోషాలు.

అలాగే ఏ ఆదివారమో మాంసాహారం వండుకుంటారు. అలా వండుకోగానే పొయ్యి శుభ్రం చేయాలి. అలా కాకుండా ఆ పొయ్యి మీద శాఖాహార నైవేద్యాలు వండి దేవుడికి అర్పించటం వంటివి చెయ్యకూడదు. అలా చేస్తే మాంసాహారం పెట్టినట్టే.

## తులసి అంటే సాక్షాత్తు లక్ష్మీదేవే

కార్తీక పౌర్ణమి నాడు తులసి భూలోకంలో జన్మించింది. తొలుత పూజ చేసింది శ్రీహరి. తులసిని పూజిస్తే వివాహం కాని వారికి వివాహం, సంతానంలేని వారికి సంతానము... ధనములేని వారికి ధనము, సౌఖ్యములేని వారికి సౌఖ్యము కలుగుతాయని శ్రీబ్రహ్మవైవర్త పురాణం శెలవిస్తోంది.

## పద్మావతీ దేవికి ఆకాశరాజు ఇచ్చిన సారె

అనేక ఏనుగులు మోసేంత బెల్లమూ, దానికి సరిసమానమైన బరువుగల చింతపండూ, మూడు వందల పుట్ల పెసలు... పదిహేనువందల పాత్రలనిండా నెయ్యి, ఆవాలూ, మెంతులూ, ఇంగువ, ఉప్పు, ఇంకా దోసకాయలు, అరటిగెలలు, మిరియాలు, రెండు వందల తేనెకుండలు, కందమూలాలు... ఇంకా ఉసిరికాయలు... మరియు మూడు వందల దాసీలు, వెయ్యి ఏనుగులు, అయిదువేల ఆవులు, పదివేల అశ్వాలు అనేక పట్టుపీతాంబరాలునూ, దిండ్లనూ, పరుపులనీ ఇచ్చాడు ఆకాశరాజు. (శ్రీవేంకటేశ్వర మహాత్మ్యం ఆధారంగా)

**శ్రీలక్ష్మీనారాయణుల పూజాదికాల్లో నైవేద్యాలను మట్టి పాత్రలో అర్పిస్తే మహా పుణ్యం కలుగుతుంది. కోరిన కోర్కెలు తీరుతాయి. ఈ విధంగా తొమ్మిది శుక్రవారాలు పెట్టాలి.**



## శ్రీమహాలక్ష్మి చంచలంగా ఎందుకు ప్రవర్తిస్తుంది

క్షీరసాగర మథనంలో జన్మించిన శ్రీమహాలక్ష్మీదేవి దేవాదిదేవతల సమక్షంలో శ్రీమహావిష్ణువుని వరించింది. అది చూసిన రత్నాకరుడికి కోపం వచ్చింది.

'ఓ లక్ష్మీ జన్మించగానే తండ్రినయిన ఈ సముద్రుడికి మాటమాత్రం కూడా చెప్పకుండా భర్తను వెదుక్కున్నావు. నాకు బాధను కలుగచేశావు. కాన నీవు ఎక్కడా స్థిరంగా వుండలేవు. ఇదే నా శాపమని' శాపమిచ్చాడు.

అందుకే శ్రీమహాలక్ష్మి చంచలంగా, స్థిరంగా ఉండకుండా తన భక్తులకు సంతోషాన్నీ, బాధనూ కలుగచేస్తుంది. కానీ నియమ నిష్టలు గలవారి గృహంలో, విష్ణు భక్తుల యందూ సదా నిలిచి వుంటుంది.

## మహాభయంకర ధన కష్టాలు పోవటానికి

సుతీవ్ర దారిద్ర్య విదుఃఖ హంత్ర్యై
నమోస్తుతే సర్వభయాపహంత్ర్యే
శ్రీవిష్ణు వక్షఃస్థల సంస్థితాయై
నమో నమః సర్వవిభూతిదాయై ॥

## ముఖ్యమైన కార్యం మీరే చూసుకోవాలి

తన కళ్యాణ విషయమై ఆకాశరాజూ, ఆయన భార్య ధరణీదేవి వద్దకు వకుళాదేవిని పంపుతాడు శ్రీనివాసుడు. తిరుమలేశుడు పంపాడన్నమాటేగాని, బాధ్యతను అప్పగించాడే గాని లోలోన మహా ఆదుర్దా... అంతటి కార్యం కార్యసిద్ధి అవుతుందా అని. వకుళాదేవి చేయగలదని శ్రీనివాసుడు అనుకోలేదు. తనే రంగంలో దిగాడు. ఎరుకుల సాని వేషం ధరించి నారాయణపురం వెళ్ళి సోది చెప్పి వివాహానికి మార్గం సుగమనం చేస్తాడు.

కాన ప్రతి ముఖ్యమైన కార్యాన్ని ఎవ్వరికీ అప్పగించకుండా, ఒకవేళ అప్పగించినా మీరు పర్యవేక్షించటం వల్ల విజయం సిద్ధిస్తుంది. విజయమంటే ధనం.. ధనమంటే సుఖం...

**దత్తాత్రేయుడు అనఘస్వామిగా అవతరించినప్పడు శ్రీమహాలక్ష్మిదేవి అనఘాదేవి పేరుతో అవతరించి జలభాసురుడనే రాక్షసుడ్ని సంహరించింది**



## ఏ సుగుణాలున్న భర్త ధనాన్నీ, కీర్తినీ, సుఖాన్నీ ఇవ్వగలడు

- పుణ్యపురుషునికి పదహారు దివ్య గుణాలుండాలి. ఆ గుణాలున్న వాడే భార్యని సకల వైభోగాలతో, సుఖాలతో ఉంచగలుగుతాడు. పదహారు గుణాలన్న వాడు ఒక్క శ్రీరామచంద్రుడే.

ఆ గుణాల్లో కనీసం ఓ నాలుగన్నా కలిగి ఉండే వాణ్ని కట్టుకున్న స్త్రీ ఇహపర సుఖాలతో సుఖంగా, వైభవంగా వుంటుంది.

ఆ పదహారు గుణాలు... సద్గుణము, పరాక్రమము, ధర్మము, ఉపకారితనము, అసత్యం ఆడకపోవటము, నియమబద్ధమైన జీవితాన్ని గడుపుతుండటము, పగవారు కూడా వంక పెట్టని విధానాలను అనుసరించే వాడు, సకలప్రాణకోటికీ ఉపకారం చేసేవాడు, విజ్ఞానవంతుడు, ప్రేమ తత్త్వము కలవాడు, అందమైన వాడు, ఆజానుబాహుడు, కోపాన్ని సదా అదుపులో వుంచుకునేవాడు, స్పష్టంగా పలికేవాడు, అసూయలేనివాడు, తేడావస్తే వందమంది వచ్చినా జంకకుండా ఎదురునిలిచేవాడు.

**పుష్యశుద్ధంలో వచ్చే ఏకాదశిని 'పుత్రద' అంటారు. ఆ రోజున సంతానం లేనివారు ఉపవాసాదాదులతో కేశవుణ్ని పూజిస్తే యోగ్యుడైన పుత్రుడు కలుగుతాడని ఏకాదశీ మహాత్యం శెలవిస్తోంది.**

**పేదరికాన్ని పోగొట్టేవి నాలుగే....ఆ నాలుగింటినీ బృహస్పతి చెప్పాడు. సంపదను పొందటానికి ధనవంతుడవ్వటానికి మిత్రుడూ, వెండీ, బంగారమూ, ఆలోచనా... ఇవే ముఖ్య కారణాలని దేవగురువు శెలవిచ్చాడు.**



## సకల సంపదలను పోగొట్టేది ఒక్క నీచుడి స్నేహమే

శరీరమంతా విషపూరితము.. మాటా, చేష్ట మాత్రం అమృతమయం. అలాంటి వాళ్ళ వల్ల సకల సంపదలూ పోతాయి. మైత్రితో గౌతముడనే వానికి గంగానదిలో మంచి రుచయిన చేపలను కాల్చి పెట్టింది కశ్యపుడి సంతానమైన నాడీజంఘుమనే కొంగ. వర్ణాంతర వివాహం చేసుకొని కులవృత్తిని కూడా ధిక్కరించిన తన స్నేహితుడు  గౌతముడి ధనకష్టాలకు చలించి బాగు చేద్దామని భావించింది.  తన మిత్రుడైన మధుర్వజ రాజు వద్దకు పంపింది. పేదరికాన్ని పోగొట్టమని చెప్పింది. మధుర్వజ రాజైన విరూపాక్షుడు గౌతమునికి అనేక సంపదలిచ్చి పంపాడు. వాటిని మోసుకుంటూ వచ్చిన మిత్రుణ్ని చూసి అబ్బురపడింది. అయితే ఆ రాత్రి గౌతముడు మాంసప్రీతితో తనకు అన్ని సంపదలూ వచ్చేలా చేసిన నాడీ జంఘుమునే ఆ కొంగను చంపి దాని మాంసాన్ని భక్షించాలనుకున్నాడు.  కాన స్నేహధర్మానికి  మచ్చ తెచ్చే నీచులతో స్నేహం, సాయం మీకే అపాయం. ఇది సత్యయుగం కాదు. తన స్నేహితుణ్ని చంపిన గౌతముడ్ని వెదికి ముక్కలు ముక్కలు చేసి పుణ్యధారలతో నాడీజంఘుడ్ని బ్రతికించటానికి.

## బంధువులనూ, ధనాన్నీ తిరిగి పొందాలంటే

కొడుకు, కోడలు, కుమారుడు, అల్లుడూ, అన్నదమ్ములూ, బంధువులూ ఎవరైనా మాటపట్టింపు పై లేనిపోని అపోహలతో దూరమైతే ఆ బాధ ఎవ్వరికైనా వర్ణనాతీతము.

అలాంటి వ్యథలున్నవారు ఏదైనా నోముగానీ, వ్రతముగానీ, ఆయా మాసాల్లో చెయ్యవల్సినవి ప్రారంభించి అందరినీ ఆహ్వానించి చేయటం ద్వారా ఆత్మీయులంతా దగ్గరవుతారు. రాజసూయ యాగమప్పుడు ధర్మరాజులా అతిప్రేమతో అయిన వారందరికీ వ్రత, పూజాదికాల్లో పెద్దపీట వెయ్యకుండా కార్యాన్ని పూర్తి చేయండి. అలాగే మీ వైభవాన్ని చూపించే ప్రయత్నం చెయ్యకుండా, నియమనిష్ఠలతో మంచి మాటలతో పూజ పూర్తి చేస్తే అంతా దగ్గరవుతారు. తద్వారా సుఖప్రాప్తి, ధనప్రాప్తి కూడా.

## అశ్వత్థవృక్ష స్తుతి

మూలతో బ్రహ్మరూపాయ మధ్యతో విష్ణురూపిణే,
అగ్రత శ్శివరూపాయ వృక్షరాజాయ తే నమః.



## ధనం కన్నా శీలం ముఖ్యం....

భర్తని సాధించటానికో.. లేనిపోని కోర్కెలకో, మరో కారణాలతో అహల్యలా ఇంద్రుని ఆహ్వానిస్తే ఇది త్రేతాయుగం కాదు శ్రీరాముని పాదధూళి సోకి పవిత్రత చెందటానికి. అలాగే ఆ రోజుల్లో ధనం కోసం అక్రమ సంబంధాలుండేవి కావు. ఈ కలియుగంలో ధనం కోసమే అక్రమ సంబంధాలు.

మగాడికి ఈ కలియుగ కాలంలో స్త్రీ శరీరం ఒక్కటే కాదు, ఆమె దగ్గరున్న ధనం కూడా. అందుకే ఆ వైపు నుంచి వచ్చి స్త్రీని లొంగదీసుకొని ఆపై నిపాందిగా ధనాన్ని కూడా పొందుతాడు. శీలం పోతే దాగుతుందేమో కానీ ధనం పోతే.. ఆ స్త్రీ యాతన పగవారికి కూడా వద్దు. ఆ ధనం సంగతి బైటికొస్తే పరువూ, కాపురమూ, మర్యాదా మన్ననా.. అన్నీ పోతాయి. స్త్రీ తప్పటడుగు వెయ్యటమంటే అష్టదరిద్రాలకీ అధినేత్రి అయిన జ్యేష్ఠాదేవిని ఆహ్వానించటమే. నేను శీలవతినీ, నిప్పు లాంటి దాన్ననీ. వడ్డీకి ఆశపడి ధనాన్ని భర్తకి తెలియకుండా ఇచ్చానని చెప్పినా లోకం సంగతి దేవుడెరుగు భర్త నమ్మడు. అది చాలు ఆ స్త్రీ భూమి మీదే నరకం చూడటానికి.

## విజయలక్ష్మి అనుగ్రహించాలంటే

ధర్మరాజు కౌరవులందరినీ తుదముట్టించి రాజ్యలక్ష్మిని పొందాడు. దానికి కారణము దుర్యోధనుడి చెడు ప్రవర్తన, శ్రీకృష్ణుని సాయం.. ఇవన్నీ పక్కన పెట్టండి. దుర్యోధనుడు తను అనుకున్నదాన్ని ఎవర్నీ సంప్రదించకుండా వివేకహీనంగా చేసేశాడు. ఎక్కువ విషయాల్లో భంగపడ్డాడు. ధర్మరాజాదులకన్నా ధనం విషయంలో, బలం విషయంలో ఇంకా ఎన్నింటిలోనో ఎక్కువ అయినా ఓడిపోయాడు. కారణం ఏకపక్ష నిర్ణయం. అదే ధర్మరాజు ప్రతి విషయాన్నీ శ్రీకృష్ణుణ్నీ, మంత్రి ధౌమ్యుణ్నీ సంప్రదించి చేశాడు. అందుకే సకల కార్యాల్లోనూ విజయాన్ని సాధించాడు. చదరంగంలో ఆడేవారికన్నా చూసేవాళ్ళకే ఎక్కువ ఎత్తులు తెలుస్తాయి. ఆ ఒక్క సూత్రంతోనే ధర్మరాజు విజయాన్ని సాధించాడు. విజయమంటే ధన అధికార సంపదలే.

## సకల కష్టాలు పోవుటకు సీతాస్తుతి

ఉద్భవస్థితి సంహార కారిణీం క్లేశహారిణీమ్,
సర్వశ్రేయస్కరీం సీతాం నతోஉహం రామ వల్లభామ్.



## ధన, వస్తు విషయాల్లో ఇంకేమి కావాలని అడగవద్దు

ఆనంద, సంతోషకర, అహంకార సమయాల్లో దాన ధర్మాది విషయాల పట్ల ఆచితూచి మాట ఇవ్వండి. ఇరవై ఒక్కసార్లు శత్రుసంహారం చేసి పరశురాముడు భూమిపై క్షత్రియులందర్నీ సంహరించి సంపాధించిన భూమిని అర్హులనుకున్న వాళ్లకి దానం చేశాడు. ఇంకేమి కావాలని అడిగాడు. పరశురాముడ్ని ఏం అడిగారో తెలుసా? మీరు నుంచున్న భూమిని కూడా ఇమ్మన్నారు. అంటే ఈ భూమి మీద మీరు కాలుపెట్టకూడదని అర్థం.. కాబట్టి ధన సంబంధించిన విషయాల్లో మీరివ్వాలనుకున్నవి ఇవ్వండి.. వారికేమి కావాలో అడిగి మహా సమస్యను కొని తెచ్చుకోవద్దు.

**ఎడమకన్నూ, ఎడమ భుజమూ అదిరితే మహా అవస్థలు తప్పవు. మహా కష్టాల ముందు ధర్మరాజుకు అదిరితే దాని ఫలితాల గూర్చి భీమసేనడుకి చెప్పి బాధ పడ్డాడు ధర్మరాజు.**

## రుణానుబంధం వలదు

ధనం తీసుకొని సేవ చేయించుకొని ఎగ్గొడితే అది ఎప్పటికైనా, ఎలా ఐనా తీర్చాల్సిందే. కాస్త ఆలస్యమంతే... అప్పు లేకపోతే అంతకు మించిన అదృష్టం లేదు. అదే రుణపడితే తీర్చాల్సిందే. పధ్నాలుగు భువన భాండాలను ఏలే శ్రీమహావిష్ణువుకి ధనలక్ష్మి భార్యయినా సరే శ్రీరామావతారంలో లక్ష్మణుడితో సేవ చేయించుకున్నందుకు ఆ ఆదిశేషుడి రుణం కృష్ణావతారంలో బలరాముణ్ని గౌరవించి, సేవించి రుణం తీర్చుకున్నాడు. రుణమంటే ఏమిటో తెలుసా...? సంపాధించిన ధనాన్ని, గౌరవాన్ని, సేవలనూ ఇచ్చి తీర్చుకునేది రుణము. కాన రుణగ్రస్థులు ఏ విధంగా అవ్వకండి. ఎన్ని చేసినా, ఎంత కష్టపడినా ధనముండటం లేదంటే మీ రుణం తీరలేదనే.

## గడపకు అటూ ఇటూ నిమ్మకాయలు

వ్యాపార సముదాయాల్లో లక్ష్మీదేవి ప్రీతికొరకూ, వ్యాపారాభివృద్ధికి పూజ చేసి పూజ వద్ద నిమ్మకాయలను విడిపోకుండా కోసి వాటిలో పసుపుకుంకుమలని అద్ది ఉంచితే శుభలాభసాటి కార్యములు జరుగుతాయి. అదే గృహంలో అయితే ప్రవేశ ద్వారమునకు అటూ ఇటూ పెట్టాలి. దుష్టశక్తులు తొలిగి శ్రీలక్ష్మి ఆనందంగా నడుస్తూ గృహంలోకి ప్రవేశిస్తుంది.



## నడమంత్రపు సిరి....

ధనం రావటానికీ, పోవటానికీ ఎంతోసేపు పట్టదు. ధనమున్నప్పుడు అనుభవించిన సుఖాలుకన్నా, ధనం లేనప్పుడు కలిగే దుఃఖమే ఎల్లప్పుడూ గుర్తుకు వస్తుంది. భూమిపైనున్న సంపదను పొందిన ధర్మరాజుకి సకల రాజ్యలక్ష్మి పోవటానికి ఎంతోసేపు పట్టలేదు. ఆఖరికి అడవుల పాలు కావాల్సి వచ్చింది. అలా ధనాన్ని పొందిన దుర్యోధనుడు ఆ నడమంత్రపు సిరితో మహా అహంకారంగా మారి సర్వనాశనాన్ని కొని తెచ్చుకున్నాడు. అదే కుబేరునికి తన మిత్రుడైన పరమేశ్వరుని వల్ల ధనాధిపతి పదవొచ్చింది. దుర్యోధనడు, కుబేరుడు ఎవరు నిలుపుకున్నారు నడమంత్రపు సిరిని? సిరి ఏదైనా నడమంత్రుపు సిరి అయినా ధర్మంగా రావాలి? అప్పుడే అది సుఖాలనిస్తుంది. కీర్తిని ఇస్తుంది. నిలిచి కూడా వుంటుంది.

## నేతి అన్నాన్ని నైవేద్యంగా పెడితే

పాదాలు కనిపించే శ్రీలక్ష్మీనారాయణులకు పాద పూజ చేసి ఆపై నేతి అన్నాన్ని నైవేద్యంగా పెడితే నరదిష్ఠిలు తొలగిపోతాయి. ఆ నేతి అన్నాన్ని పదుగురికీ ప్రసాదంగా పంచితే ఇంట్లో ధనంతో పాటు సుఖం ప్రశాంతతలు చేకూరుతాయి.

## యాచకత్వం అసలే వద్దు

యాచకత్వం అంటే మీరనుకునేది కాదు. చేయి చావటము. తీసుకోవటమే గాని ఇవ్వటం ఇష్టంలేకపోవటము. మా ఇంటికొస్తే ఏం తెస్తావ్, మీఇంటికొస్తే ఏం ఇస్తావ్? .. .. కనీసం కొన్నిసార్లు అయినా అవకాశం ఉన్నంతవరకైనా మీ చేయి పైన ఉంచండి. సహాయ పడండి. తద్వారా చేయి చాపటము అనే మహా దోషం పోతుంది. మీ చేయి పైనున్నప్పుడే సుఖం వుంటుంది. ధనముంటుంది. గౌరవం వుంటుంది. చేయి చాపటమంటే గతజన్మలో కూడా అలాగే చేయి చాపి చాపి, తీసుకోవటమే గానీ ఇవ్వకపోవటం వల్ల. ఆ దోషం ఈ జన్మలో ధనం కోసం చేయి చాపాల్సి వస్తుంది. ఆ దోషం పోవాలంటే మీకు చేతనయినంతలో మీ చేతిని పైనుంచండి. అన్నార్తులకూ, అసహాయులకూ సహాయం చేయండి. ఈ జన్మలోనే లక్ష్మి అనుగ్రహిస్తుంది.

## పంచపర్వములు

అష్టమి, చతుర్దశి, పూర్ణిమ, అమావాస్య, సూర్యసంక్రమణములు పంచ పర్వములు... అనగా శ్రీకృష్ణాష్టమి, శ్రీరామనవమి, శివరాత్రి, ఏకాదశి, ఆదివారములు. వీటిని ఆచరించిన వారికి 'లేమి' అన్నది వుండదనీ, సమస్త దోషాలూ పోతాయనీ శ్రీబ్రహ్మవైవర్త పురాణం తెలవిస్తోంది.



## శుక్ర, శనివారాలు లక్ష్మీదేవికి పెరుగున్నం నైవేద్యంగా నివేదిస్తే...

శుక్రవారం సాయం సమయంలో శ్రీమహాలక్ష్మీదేవిని పూజించి పెరుగన్నాన్ని నైవేద్యంగా పెడితే మహాధనప్రాప్తి కలుగుతుంది. అలాగే పెరుగన్నంలో దానిమ్మ గింజలను చేర్చి ఆపై నైవేద్యంగా పెట్టిన ఆరోగ్య సమస్యలు తొలగిపోతాయి. దానిమ్మ అమ్మవారికి ఇష్టమైన పండు కూడా. ఎర్రటి పండ్లను, పూలను అమ్మవారు ఎక్కువగా ఇష్టపడతారు.

అలాగే శనివారం శ్రీలక్ష్మీనారాయణులకు పూజ చేసి పెరుగన్నాన్ని నివేదించి ముత్తైదువులకి ఇస్తే శత్రువుల పీడలు, వారి శాపాలూ తొలిగి సుఖశాంతులు కలుగుతాయి.

**శ్రీకృష్ణునికి నైవేద్యంగా పెట్టిన వెన్నను అలాగే ప్రసాదంగానే స్వీకరించాలి తప్ప వంటకు, దీపారాధనకి వినియోగించకూడదు.**

## ధన సమస్యలూ, కుటుంబ సమస్యలూ అన్నీ నాకే...

ఆ సమస్యలన్నీ తనకే అనుకుంటారు. అందరికీ వున్నాయి. అలాంటి సమస్యలతోనే ఓ ఇల్లాలు బుద్ధభగవానుడి వద్దకొచ్చింది. తనకన్నీ సమస్యలేననీ... సీతమ్మ వారు కూడా అన్ని కష్టాలు పడలేదేమోనని చెప్పింది. అప్పుడు గౌతమ బుద్ధుడు గుప్పెడు ఆవాలిచ్చి, నీకన్నా తక్కువ సమస్యలున్న వారికి ఈ ఆవాలివ్వు... నీ సమస్యలు పోతాయని చెప్పాడు. ఆ ఇల్లాలు ప్రతి ఇంటికెళ్ళి తన సమస్యలు చెప్పి మీకింతకంటే తక్కువ సమస్యలే గదాని అడిగింది. అసలు నీ సమస్యలూ ఒక సమస్యలేనా అని వారి సమస్యలు చెబుతుంటే ఆమె తల తిరిగి బుద్ధుని వద్దకొచ్చి 'స్వామీ చాలా మంది సమస్యల కంటే నావి చిన్న సమస్యలే' అని చెప్పి ఆ ఆవాలను బుద్ధభగవానునికి ఇచ్చేసింది. కాన మానవ జీవితమంటేనే సమస్యలు.. అనారోగ్యం.. ధనలేమి. మహా ధనప్రాప్తి... దుఃఖం. అదే జీవితం.. వాటిని జయిస్తేనే సుఖం.. ధనం.



## గృహంలో శుభకార్యం జరగాలంటే... చక్రపొంగలి

ఇంట్లో జరగబోయే శుభకార్యాలు త్వరగా జరగాలన్నా, ఆటంకాలు పోవాలన్నా లక్ష్మీనారాయణులకి చక్రపొంగలిని నైవద్యంగా సమర్పించండి. ఆ చక్రపొంగలిని తయారు చేయు విధానం.

కావలసిన పదార్థములు :

బియ్యం - 2 కప్పులు

పెసరపప్పు - 1 కప్పు

బెల్లం తరుగు - 1 1/2 కప్పు

యాలకపొడి - అరచెంచా

ఎండుకొబ్బరి ముక్కలు - పావు కప్పు

జీడిపప్పు ముక్కలు - సరిపడ

నెయ్యి - అరకప్పు

తయారీ విధానం : ముందుగా నీటితో బియ్యం, పెసరపప్పులను శుభ్రం చేసి 6 కప్పుల నీటితో వండుకోవాలి. ఈలోపల బెల్లం తరుగుఒక గిన్నెలో వేసి కొంచెం నీరు పోసి లేత పాకం రానివ్వాలి. అరకప్పు

నేతిలో సన్నగా కట్ చేసిన ఎండుకొబ్బరి ముక్కలు వేసి వేపుకోవాలి. అవి తీసి పక్కన ఉంచి సరిపడ జీడపప్పు ముక్కలను కూడా వేపి ఉంచాలి.

ఉడికిన అన్నాన్ని ఒక వెడల్పాటి బేసిన్‌లో వేసి పాకం జత చేసి అంతా కలిసేలా కలపాలి. ఆ తర్వాత వేపిన ఎండుకొబ్బరి ముక్కలు, జీడిపప్పు ముక్కలు వేసి బాగా కలిపి అమ్మవారికి నైవేద్యంగా పెట్టాలి.

## శ్రీమహావిష్ణు స్తవము ఎంతటి సంపదలనిస్తుంది

ఈ స్తవాన్ని ప్రతిరోజూ మూడు పూటలా పఠించినా, విన్నా, వ్రాసినా అపార సంపదలూ, ఆయుష్షూ, కీర్తీ కలుగుతాయి. ఈ స్తవాన్ని భీష్ముడు స్వర్గస్థుడు కావటానికి సిద్ధంగా వుండి ఉత్తరాయణం కోసం ఎదురు చూస్తున్నప్పుడు మహా మహా ముని శ్రేష్ఠుల ముందు శ్రీకృష్ణుడికి నమస్కరిస్తూ ఉచ్ఛస్వరంతో స్తుతించాడు. ఆ స్తవాన్ని వైశంపాయనుడు జనమేజయునికి చెప్పి స్తవాన్ని పఠించడం వల్ల కలిగే ఫలాలను కూడా చెప్పాడు.



**నైవేద్యాన్ని రాగిపాత్రలో సమర్పించిన భక్తులన్న శ్రీమహావిష్ణువుకి ఎంతో ప్రీతి. గుడాకేశుడు అనే విష్ణు భక్తుడు దాల్చిన రూపమే రాగి. అందుకే శ్రీమహావిష్ణువుకి ఆ పాత్రలో సమర్పించిన నైవేద్యమన్న ప్రీతి.**

## శనగలను నైవేద్యంగా సమర్పిస్తే

ఆర్థిక సమస్యలు తీరటానికి భృగుపుత్రిక లక్ష్మీదేవికి శనగలను నానబెట్టి, ఉడికించి నైవేద్యంగా సమర్పించి వాటిని ప్రసాదంగా పంచిపెడితే ధనసమస్యలు తీరతాయి. శనగలను పూజలో నివేదించకుండా ఇవ్వటం తగదు. తీసుకున్నా, ఇచ్చినా దోషమే. అయితే గ్రహ దోషాలున్న వారు పురోహితుని సూచనపై శనగలను దానంగా ఇవ్వాలి.

# ధన సంపదల కోసం లక్ష్మీదేవికి నైవేద్యంగా సమర్పించాల్సిన కొబ్బరన్నం తయారీ విధానం

కావాల్సిన పదార్థములు :

పచ్చికొబ్బరి తురుము - 1 కప్పు

కొంచెం పొడిగా ఉడికించిన అన్నం - 3 కప్పులు

పచ్చిమిర్చి ముక్కలు - రెండు చెంచాలు

అల్లం ముక్కలు - 1 చెంచా

ఉప్పు - సరిపడ

పోపు దినుసులు - 2 చెంచాలు

వేరుశెనగగుండ్ల - 2 చెంచాలు

జీడిపప్పు - 3 చెంచాలు

కరివేపాకు - సరిపడ

నెయ్యి - అర కప్పు

తయారీ విధానం : ముందుగా మిర్చి, అల్లం ముక్కలన్నింటినీ మిక్సీలో వేసి మెత్తగా పేస్టు చేసుకోవాలి. కొబ్బరిని తురుముకోవాలి.

బాండీలో నెయ్యి వేసి దాంట్లో పోపుసామాను, కరివేపాకు, వేరుశెనగ గుండ్లు, జీడిపప్పు వేసి వేపి వేగిన తర్వాత మెత్తగా చేసుకున్న పేస్టు, కొబ్బరి తురుమును



జత చేసుకోవాలి. అన్నింటినీ బాగా కలిపి ఉడికించి ఉంచుకున్న అన్నము, సరిపడ ఉప్పును జత చేయాలి. అన్నింటినీ బాగా కలిపి కిందికి దించుకోవాలి.

ఈ కొబ్బరన్నం తెల్లగా ఉంటుంది.

# అపార నష్టం కలిగి ధనమంతా పోయిందా...

అలాంటి పరిస్థితి కోసలరాజుకి వచ్చింది. కాలకవృక్షముడనే ముని వద్దకెళ్ళి తన అమితమైన వ్యథను బైటపెట్టాడు. అప్పుడా ముని ఇలా చెబుతాడు. మహా ధనంతో అధికారంతో సుఖాలనుభవించావు. ధనం ఎప్పుడూ శాశ్వతము కాదు. దానికి బానిస అవ్వకు. ధనముంటేనే సుఖం, లేకపోతే దుఃఖమనుకోకు. నీ వారినీ, ఆప్తులనీ ధనంతో కాపాడలేవు. వారికంటే గొప్పది కాదు ధనం. బాధపడినంత మాత్రాన ధనాన్ని తిరిగి పొందలేవు. అయిపోయిన దాని గూర్చి ఆలోచించకు. రాబోయే దాని గూర్చి ఆశ చెందు. దైన్యాన్ని దరిదాపులకు రానీయకు. ధనం రావటం, పోవటమన్నది మానవుల చేతుల్లో లేదు. అలాంటిది జరిగినప్పుడు మౌనమే ఉత్తమం. ధనం పోయిన దగ్గరే వెతకాలి. దానికి కాస్త సమయం కావాలి. మౌనం ఎంతో కావాలని చెబుతాడు. మృదుత్వం కావాలి. మృదత్వంతో శత్రువులను తుడిచి వేయచ్చు. మృదుత్వం సాధించలేనిదేమీ లేదు. ఇక ధనమెంత అని చెబుతాడు ఆ ముని.

# భార్గవికి నివేదించే అన్నం పాయసము చేసే విధానం

కావాల్సిన పదార్థములు : పాలు - లీటరు

బియ్యం - పావుకిలో

బెల్లం - పావుకిలో

పెసరపప్పు - 1 కప్పు

జీడిపప్పు - అర కప్పు

ఎండుద్రాక్ష - 2 చెంచాలు

యాలకలపొడి - అర చెంచా

తయారీ విధానం : ముందుగా బియ్యం, పెసరపప్పులను కలిపి శుభ్రంగా కడిగి పావుగంట సేపు నానపెట్టాలి.

పొయ్యి మీద పాలు పెట్టి కాగిన తర్వాత మంట తగ్గించి నానిన బియ్యం, పెసరపప్పు వేసి కలుపుతూ మెత్తగా ఉడికించాలి. బియ్యం ఉడికిన తర్వాత బెల్లం వేసి రెండు నిమిషాలు ఉడికించి దించాలి. దీంట్లో అర చెంచా యాలక్కాయల పొడి వేసుకోవాలి.

తర్వాత బాండీలో నెయ్యి వేసి జీడిపప్పు, ఎండుద్రాక్ష వేసి వేగిన తర్వాత తీసి పాయసంలో వేసుకోవాలి. బాగా కలిపి నైవేద్యం సమర్పించాలి.



# ఆండాల్ తల్లినే లక్ష్మీదేవిగా పిలిచే ఆ ధనమాతకు నైవేద్యంగా పెట్టాల్సిన శాకాన్నం తయారీ విధానం

కావాల్సిన పదార్థములు : దొండకాయలు - 4

క్యారెట్ - 1

బంగాళదుంప - 1

పచ్చిబఠాణి - 3 చెంచాలు

చిక్కుడుకాయ ముక్కలు - 2 చెంచాలు

క్యాప్సికం - 2 చెంచాల ముక్కలు

చామదుంప - 2 చెంచాలు ముక్కలు

బీన్స్ - 3 చెంచాల ముక్కలు

పచ్చిమిర్చి - 3

బియ్యం - 1 గ్లాసు

ఉప్పు - సరిపడ

నెయ్యి - 1 కప్పు

యాలకులు, జాజికాయ, లవంగాలు, దాల్చినచెక్క, జాపత్రి అన్నింటినీ కలిపి 3 చెంచాలు పొడి అయ్యేట్లుగా చూసుకోవాలి.

జీడిపప్పు పలుకులు - పావు కప్పు

కరివేపాకు - సరిపడ

కొత్తిమీర - పావుకప్పు

తయారీ విధానం : కూరల్నింటినీ శుభ్రంగా కడిగి చిన్నముక్కలుగా కట్ చేసుకోవాలి. బియ్యం కడిగి సరిపడ నీరు పోసి పక్కన ఉంచాలి. మందపాటి గిన్నెలో రెండింటినీ జత చేసి సరిపడ ఉప్పు వేసి ఉడికించాలి. తర్వాత బాండీలో నెయ్యివేడి చేసి దాంట్లో యాలకలు మొదలగు దినుసులన్నింటినీ పొడిచేసి ఆ పొడిని వేసి వేపి ఆ మిశ్రమాన్ని ఉడికిన అన్నం మిశ్రమంలో వేసి బాగా కలపాలి. తర్వాత కొంచెం నేతిలో జీడిపప్పు కూడా వేసి వేపి వాటిని కూడా కలిపాలి. తయారైన శాకాన్నాన్ని ఒక బౌల్‌లోకి తీసుకొని పైన కొత్తిమీర చల్లి అమ్మవారికి నైవేద్యం సమర్పించాలి.

**శ్రీలక్ష్మీనారాయణులను పూజించి జామపండ్లను నైవేద్యంగా పెట్టి ఆపై ఆ జామపండ్లను దంపతులకి ఇచ్చి నమస్కరిస్తే దాంపత్యంలో కలహాలూ, కలతలూ తొలగిపోతాయి.**



## కనకధారలను కురిపించే లక్ష్మికి నివేదించాల్సిన పులిహోరను ఏ విధంగా తయారుచేయాలి

కావాల్సిన పదార్థములు : బియ్యం - పావుకిలో
చింతపండు : నిమ్మపండంత
వేరుశెనగ గుండ్లు - పావు కప్పు
జీడిపప్పు - పావుకప్పు
పోపుసామాను - 3 చెంచాలు
పచ్చిశెనగపప్పు - 2 చెంచాలు
ఎండుమిర్చి - 4
పచ్చిమిర్చి - 6
కరివేపాకు - సరిపడ
కొత్తిమీర - సరిపడ
పసుపు - సరిపడ
ఇంగువ - పావు చెంచా
నూనె - అర కప్పు
ఆవపిండి - 1 చెంచా
మెంతిపిండి - పావు చెంచా
బెల్లం - 2 చెంచాలు

తయారీ విధానం : ముందుగా బియ్యం శుభ్రంగా కడిగి చిటికెడు పసుపు, 1 చెంచా నూనె వేసి కలిపి ఉడికించాలి.

మందపాటి గిన్నెలో చింతపండు గుజ్జు తీసి దానికి కొంచెం ఉప్పు, బెల్లం, పచ్చిమిర్చి జత చేసి చిక్కగా ఉడికించాలి.

ఉడికిన అన్నాన్ని వెడల్పాటి పళ్ళెంలో వేసి సరిపడ ఉప్పు, పసుపు, కరివేపాకు, కొత్తిమీర, చింతపండు చిక్కగా ఉడికించినది వేసి సన్నని అట్లకాడతో అంతా కలిసేలా కలిపి పక్కనుంచాలి.

ఈ లోపు బాండీలో నూనె వేడి చేసి వేరుశెనగగుండ్లు, పోపుసామాను, పచ్చిశెనగపప్పు వేసి వేపాలి. ఇవి కొంచెం వేగిన తర్వాత జీడిపప్పు కూడా జత చేసి వేపాలి. అన్నీ వేగిన తర్వాత పచ్చిమిర్చి, ఎండుమిర్చి, ఇంగువ, మెంతిపిండి, ఆవపిండి వేసి బాగా కలిపి వేడి వేడిగా అన్నంలోకి కలపాలి. అన్నీ కలిసేటట్లు బాగా కలిపి ఒక గిన్నెలోకి తీసి అమ్మవారికి నైవేద్యంగా సమర్పించాలి.

**కూర్చుని రెండు కాళ్ళు వూపే వారి నుంచి ధనలక్ష్మి దూరంగా వెళ్లిపోతుంది. అనారోగ్యలక్ష్మి ఆవహిస్తుంది. అలా చేసేవారికి పక్షవాతం కూడా వచ్చే అవకాశం వుంది.**



# క్షీర లక్ష్మి అమ్మవారికి పాలతాలికల నివేదన

కావాల్సిన పదార్థములు : పాలు - అరలీటరు

సగ్గుబియ్యం - గుప్పెడు

బియ్యంపిండి - 1 కప్పు

బెల్లం - పావు కప్పు

పంచదార - 1 కప్పు

జీడిపప్పు - పావు కప్పు

తయారీ విధానము : ముందుగా పాలు పొయ్యి మీద పెట్టి కాగిన తర్వాత సగ్గుబియ్యం వేసి ఉడికించాలి. ఈ లోపల బియ్యంపిండిని వేడిపాలతో గట్టిగా చపాతీ ముద్దగా కలుపుకోవాలి. సగ్గుబియ్యం ఉడికిన తర్వాత బియ్యంపిండిని చక్రాల గిద్దలోకి తీసుకొని పాలలోకి చక్రం లాగా వత్తుకోవాలి. రెండు నిమిషాలు ఉడికిన తర్వాత మళ్ళీ బియ్యంపిండితో ఇంకోసారి వత్తుకోవాలి. తర్వాత నెమ్మదిగా కలుపుతూ ఉడికించాలి. పిండి ఉడికిన తర్వాత మిగిలిపోయిన బియ్యంపిండి ముద్దని నీటితో చిక్కగా జారుగా అయ్యేటట్లు కలిపి ఉడుకుతున్న మిశ్రమంలో కలపాలి. ఆ తర్వాత పంచదార జత చేయాలి. 5 నిమిషాలు ఉడికించి దించి కొంచెం నేతిలో దోరగా వేయించిన జీడిపప్పు వేసి కలిపి కొంచెం చల్లార్చి అమ్మవారికి నివేదించాలి.

## నన్నందరూ మోసం చేస్తున్నారు...పైగా నన్నే తిడుతున్నారు

ధనం విషయంలో అమాయకత్వంగా ఉన్న వారినీ, మన అని నమ్మిన వారినే ఎవరైనా మోసం చేసేది. మోసం చేసేవాడు చెప్పిన మాటలు నమ్మేగా ధనమిచ్చింది. అంటే ఎంతో కొంత మీరూ దానికి బాధ్యత వహించాలి. ధర్మ, న్యాయ మార్గాలు తప్పకపోతే ఎవ్వరూ ఎవర్నీ మోసం చెయ్యలేరు. ఓ పిల్లాడు గుహలోకి వెళ్ళి నానా మాటలు మాట్లాడాడు. అవి ప్రతిధ్వనించాయి. తల్లి దగ్గరికొచ్చి ఆ గుహ నన్ను తిడుతుందే అని చెప్పాడు. అప్పుడా తల్లి నాయనా ఈసారి వెళ్ళి మంచి మాటలు ఆ గుహకు చెప్పు అని అన్నది. తల్లి చెప్పినట్టే చేసాడు ఆ పిల్లాడు. ఆ మంచి మాటలు మధురమైన మాటలే తిరిగి ప్రతిధ్వనించాయి. పిల్లాడు సంతోషపడ్డాడు. కాబట్టి ఓసారి ఆలోచించండి. అంతా మనకి వ్యతిరేకంగా జరుగుతుంటే, అన్ని రకాలుగా నష్టం వస్తుంటే, అందులో మన బాధ్యత ఎంతుందో సరిచూసుకోండి. సరి చేసుకోండి.



## ధనం కన్నా మిత్రుడు మిన్న

బ్రహ్మహత్యా పాతకానికైనా ప్రాయశ్చిత్తం ఉంది కాని మిత్ర కృతఘ్నుడికి పాప నిష్కృతి లేదు. మిత్రద్రోహం కృతఘ్నత కంటే మహా ఘోరమైన పాపం. మిత్రుడు ఇహపర లోకాల సౌఖ్యాన్ని అందించగలడు. ధనం కన్నా మంచి మిత్రుడ్ని పొందటం వల్ల ధనం వల్ల కలిగే మేలుకన్నా ఎక్కువ హితం కలుగుతుందని దేవవ్రతుడు నకుల సహదేవులకి చెప్పాడు.

## ధనమే సకల ధర్మాలను నెరవేరుస్తుంది

బంధు హితులని సంహరించి సంపాదించిన రాజ్యం నాకొద్దు అని ధర్మరాజు అన్నప్పుడు భీష్ముడు ఇలా చెబుతాడు. ధర్మజా.. నీవు పాపం చేశావని అశ్వమేధ యాగం చేసి పాపాన్ని పోగొట్టుకొన్నావు. సకల ధర్మాలనూ నెరవేర్చ గలిగింది సంపదే. ధనం లేనివారు నడ పీనుగువంటి వారని నహుషుడు కూడా చెప్పి వున్నాడు. పతితుడ్నీ, కృతఘ్నత లేనివాడ్నీ, మూర్ఖుడినీ ఎలా చూస్తారో ధనం లేని వార్ని కూడా అలానే చూస్తారు. ధనమే సకల పురుషార్థాలకూ మూలం. సంపద బంధువులని దగ్గరికి వచ్చేలా చేస్తుంది. మిత్రులను సమకూరుస్తుంది. నీ ప్రతాపాన్ని ప్రకాశింప చేస్తుంది. అట్టి సంపదే నీకు సద్బుద్ధి ఒప్పేలా చేస్తుంది.




## ధనవంతుడు సుఖవంతుడేనా?

అందరిలో అది సాధ్యపడదు. ధనం సుఖాలనే ఇస్తుంది. కొంతమంది విషయంలో మహా దుఃఖము. వారు సంపాదించిన ధనాన్ని రక్షించుకోవాల్సిన పరిస్థితి రావటం దుఃఖం. శరీరానికి మృత్యు భయం ఉన్నట్టు ధనవంతునికి దొంగల వల్లా, జలము వల్లా, అగ్ని వల్ల, బంధువుల వల్ల, అధికారుల వల్ల భయం భయమే. పక్షుల మాంసాన్ని, మృగాల మాంసాన్ని, నీటిలోని చేపల మాంసాన్ని తిన్నట్టు అంతా ధనమున్న వాని ధనాన్ని భుజించటానికే ప్రయత్నం చేస్తుంటారు. సంపద మోహింప చేస్తుంది. అలా వ్యధలు పడే వాడి ధనము పాప ధనమని అర్థం. లేదా వారి పూర్వీకులు అలా సంపాదించారని పరమార్థం. ధనాన్ని ధర్మంగా సంపాదిస్తే ధనపరమైన సౌఖ్యాలన్నీ అందుతాయని శ్రీలక్ష్మీ పురాణం శెలవిస్తోంది.

## సకల ఋణముల నుంచి విముక్తుడవ్వటకు

యమునా నదికి ఉత్తర తీరంలో ప్రయాగ క్షేత్రానికి దక్షణ భాగములో ఋణప్రమోచనము అను తీర్థ స్థలంలో స్నానమాచరించి సేవించటం వల్ల, నిద్ర చెయ్యటం వల్ల సకల ఋణాల నుంచి విముక్తి కలుగుతుందని శ్రీకూర్మ పురాణం శెలవిస్తోంది.






## యంత్రాలను ఎలా పూజించి పెట్టుకుంటే ధనసిద్ధి కలుగుతుంది

లక్ష్మీ యంత్రము కావచ్చు. కుబేర యంత్రము కావచ్చు. ఏ యంత్రమునైనా సరే దానికి సంబంధించిన సకల పూజాదికాలూ, యజ్ఞ హోమాలూ చేయించి పెట్టినప్పుడే ఆ యంత్రశక్తి వల్ల ధనసిద్ధి కలుగుతుంది.

యధాశాస్త్రీయంగా ప్రాణ ప్రతిష్ఠ చేయాలి. 4000 జపాలు చేయాలి. 4000 హోమాలు చేయాలి. తిలలు ఆజ్యముతో చేసి 1008 పర్యాయములు సంపాత్యాజ్య హోమము చేసి పెట్టినప్పుడే ధనవృద్ధి కలుగుతుంది. ఆకస్మికంగా అత్యధిక ధనప్రాప్తి వస్తుందని యంత్ర శాస్త్రము శెలవిస్తోంది. అలా ప్రతిష్ఠించిన యంత్రానికి పత్రం, పుష్పం, తోయం అన్న రీతితో ప్రతిరోజు పూజించిన ఋణవిముక్తి కలుగుతుంది. ఆర్థికదుస్థితి నుంచి బైట పడగలరు. అలా ఆయా యంత్ర పరమైన సకల విధులు చేసిన యంత్రమే కుబేరునితో సమానమైన ధనాన్ని పొందగలదు. ఏదో ఒక యంత్రాన్ని కొని పెట్టుకుంటే మిగిలేది?

## భర్త మాత్రమే సకల సౌఖ్యాలనూ, సంపదలనీ అందించేది

ఉత్తమ తీర్థము భర్తనే చెబుతోంది పద్మపురాణం లోని సుకల గాథ. భర్త సవ్యపాదం ప్రయాగ, వామ పాదము పుష్కర తీర్థము. భర్త సర్వ తీర్థ స్వరూపుడు. యజ్ఞం చేసిన ఫలం భర్త సేవ వల్ల స్త్రీకి లభిస్తుంది.

భర్త ప్రేమ లేనిదే ఈ భూమండలంలో ఎక్కడా సుఖ, సౌఖ్యాలు లభింపవు. భర్తని సంతోషంగా ఉంచితే దేవతలు సంతోషిస్తారు. శృంగారము, అలంకారము, రూపము, వర్ణము, సుగంధము అంతా భర్తే. భర్త కొరకే చేయవలెను. భర్త అనుకూలత ఉన్నప్పుడే సకల ఆభరణాలు లేకున్నా స్త్రీ శోభించును. కీర్తి, గౌరవము, పుత్రులు, ఆనందము అన్నీ భర్త వల్లే వస్తాయి. కాబట్టి భర్తని ఏ కారణాల వల్ల దూరం చేసుకున్నా సకలం దూరం చేసుకున్నట్టే.

**పాడ్యమినాడు ఆవునేతిని లక్ష్మీదేవికి నివేదన చేసి బ్రాహ్మణునికి దానం ఇస్తే ధన అనారోగ్య సమస్యలు తొలగుతాయి.**



## 21 పత్రాలతో పూజించే వినాయకుని పూజలో ఏ ప్రాప్తి దాగి వుంది?

విఘ్నేశ్వరుడు రావణుడ్నే కాదు, శ్రీమహా విష్ణువునీ ఆట పట్టించాడు. కైలాసం వచ్చిన శ్రీమహావిష్ణువు యొక్క సుదర్శన చక్రాన్ని నోట్లో పెట్టేసుకున్నాడు. దాంతో బొజ్జ గణపతి నుంచి తన సుదర్శన చక్రాన్ని తీసుకోవటానికి విష్ణువు నానా తిప్పలు పడాల్సి వచ్చింది. నీ పూజ చేసిన వారికి ఆరోగ్యమూ... ధనం కలుగుతాయని చెప్పాడు. ఆ తిప్పలకి వినాయకుడిని నవ్వు వచ్చింది. సదుర్శన చక్రం బైటికి రావటంతో శ్రీమహావిష్ణువు నవ్వి వైకుంఠాన్ని చేరాడు.

అందుకే వినాయచవితి నాడు మనము 21 పత్రాలతో పూజ చేసి వాటిని నదుల్లోనూ, చెరువుల్లోనూ, సరస్సులోన నిమజ్జనం చేస్తాము. అలా చెయ్యటం వల్ల ఆ నీరు అమృతము అవుతుంది. తద్వారా మనుష్యులే కాదు సమస్త జీవకోటి ఆ ఇరవై వక్క ఆకుల సారం కలిసిన నీటిని త్రాగి ఆరోగ్యలక్ష్మిని పొందుతారు.

1. మాచీపత్రం : దద్దుర్లు, తలనొప్పి చర్మ వాత కళ్ళకి సంబంధిత సమస్యలు తగ్గుతాయి.

2. ఆర్కపత్రం : ఇదే జిల్లేడు. చెవిపోటు, కోరింత దగ్గు, విరోచనాలు, బోధకాలు, చర్మదంత సమస్యలు సమసిపోతాయి.

**3.** మారేడు : బిల్వపత్రమని కూడా అంటారు. మధుమేహం అదుపులో ఉంచుతుంది. నేత్ర వ్యాధులను తగ్గించి, శరీరం నుంచి దుర్గంధాలను రాకుండా చేస్తుంది.

**4.** గరిక : దూర్వాయుగ్మం అని కూడా అంటారు. గాయాలు, చర్మవ్యాధులు, ఉదరముకు, అర్షమొలలకు మంచిది.

**5.** ఉమ్మెత్త : దీన్నే దత్తూర పత్రమని కూడా అంటారు. గడ్డలు, శ్వాసకోశ వ్యాధులు, కొరుకుడు, ఋతు వ్యాధులు దూరమవుతాయి. (ఇది విషమొక్క కూడా)

**6.** బదరీపత్రం : రేగుచెట్టు ఆకు జీర్ణకోశవ్యాధులను, పసిపిల్లల వ్యాధులను తగ్గించి రోగనిరోధక శక్తిని పెంచుతుంది.

**7.** ఉత్తరేణి : దీన్ని అపామార్గ పత్రమని కూడా అంటారు. దంత సమస్యలకి ముఖ్యంగా పిప్పి పన్ను గలవారికి సంజీవినిలా పనిచేస్తుంది. మూత్రపిండాల్లోని రాళ్ళని కరిగిస్తుంది.

**8.** తులసి : దగ్గు, జలుబు, జ్వరము, చుండ్రు, తుమ్ములు, ఇంకా ముఖసౌందర్యానికి ఎన్నో రకాలుగా ఉపయోగపడుతుంది.

**9.** మామిడి ఆకు : చూతపత్రం అని కూడా అంటారు. రక్త విరోచనాలు, చర్మ వ్యాధులు, అజీర్తి, కంటి వ్యాధులు తగ్గుతాయి. క్రిమికీటకాలు దరిచేరవు.



**10.** కరివీరపత్రం : గన్నేరు ఆకు... కణుతులను పోగొడుతుంది. దురదలు, కళ్ళు సంబంధిత వ్యాధులను అరికడుతుంది.

**11.** విష్ణుక్రాంత పత్రం : జ్వరం, కఫం, పడిశం, దగ్గు, ఉబ్బసములను తగ్గించి జ్ఞాపకశక్తిని పెంచుతుంది.

**12.** దానిమ్మ : దాడిమీ పత్రం. విరోచనాలు, అతిసారం, దగ్గు, కామెర్లు, ముక్కు నుంచి రక్తం కారటం, కండ్ల కలకలు, గొంతునొప్పి వంటి వాటిని తగ్గిస్తుంది.

**13.** దేవదారు పత్రం : ఈ దేవదారు అజీర్తి, పొట్ట, కంటి సంబంధిత వ్యాధులను అరికడుతుంది. ఎన్నో రోగాలకి కారణమైన అజీర్తిని తగ్గిస్తుంది.

**14.** మరువం : మరువక పత్రమని కూడా అంటారు. జీర్ణశక్తిని పెంచుతుంది. ఆకలిని కలిగిస్తుంది. జుట్టు రాలడాన్ని అరికడుతుంది. చర్మవ్యాధులను కూడా పోగొట్టే మరువం మంచి సువాసన వెలువరిస్తుంది.

**15.** సింధువార పత్రం : వావిలి ఆకు అని కూడా అంటారు. కీళ్ళ నొప్పులు, గాయాలను నియంత్రిస్తుంది. అలాగే ప్రసవం తర్వాత వచ్చే సమస్యలను పోగొడుతుంది.

**16.** జాజీపత్రం : ఈ జాజి ఆకు వాతనొప్పులు, జీర్ణాశయ సమస్యలు, నోటిపూత, దుర్వాసన, కామెర్లు, చర్మవ్యాధులను అరికడుతుంది.

**17.** గండకీ పత్రం : మూర్ఛవ్యాధి, కఫం, పొట్ట సంబంధిత వ్యాధులు, నులిపురుగులను నివారిస్తుంది.

**18.** శమీ పత్రం : ఈ జమ్మి ఆకు కఫమును, కుష్ఠు అతిసార దంత వ్యాధులను అరికడుతుంది.

**19.** రావి ఆకు : ఈ అశ్వత్థ పత్రం మలబద్ధకం, కామెర్లు వంటివే కాకుండా చర్మవ్యాధులను పోగొడుతుంది. జీర్ణశక్తినీ, జ్ఞాపకశక్తినీ పెంచుతుంది. ఈ వృక్షం క్రింద అప్పు ఇస్తే తిరిగి రావటానికి ఎంతో కాలం పడుతుంది. వడ్డీ మాత్రం సమయానికి వస్తుంది. ఈ చెట్టు క్రిందే కుబేరుడు శ్రీనివాసునికి అప్పు ఇవ్వటానికి వప్పుకుంది.

**20.** అర్జున పత్రం : అనగా తెల్లమద్ది. చర్మ, కళ్ళ వ్యాధులను అరికడుతుంది. గుండె జబ్బు రాకుండా నివారిస్తుంది.

**21.** బృహతీపత్రం : దీన్నే వాకుడాకు అని అంటారు. దగ్గు, జలుబు, జ్వరము, అజీర్ణమూ, మూత్ర పిండాల వ్యాధులనూ, నేత్ర, దంత సమస్యలను పోగొడుతుంది.

వినాయకచవితి పూజలో వాడే ఆ అమూల్యమైన వనమూలికల ద్వారా మనం మన చుట్టూ వున్న ప్రకృతిని ఎంతో ఆరోగ్యంగా తయారు చేస్తున్నాము. దాని వల్ల మనకెంతో పుణ్యలక్ష్మి ప్రాప్తి కూడా.

వర్షాకాలం కొత్త నీరు వస్తుంది నదుల్లోకి, చెరువుల్లోకి. అందుకే మన పెద్దలు వినాయక పూజ చేసి ఆ వినాయకునితో పాటు పత్రినీ నిమజ్జనం చేయమనేది. తద్వారా ఆరోగ్యలక్ష్మి కూడా మనకి కలుగుతుంది.



## ధన, కనక, కీర్తి ల కోసం శ్రీకృష్ణునికి నివేదించాల్సిన నైవేద్యం

డెబ్బయిరెండు వంటకాలను శ్రీకృష్ణునికి అర్పించి నివేదించాలి. నైవేద్యంగా సమర్పించటం ద్వారా అష్టలక్ష్ములు పరమానందభరితులవుతారు. తన భర్తకు అంతటి నైవేద్యాలని సమర్పించిన ఆ పడతికి అష్టైశ్వర్యాలను ప్రసాదిస్తుంది. నైవేద్యాలను వీలయినంత వరకూ పాలతో చేసినవి పెట్టేలా చూసుకోవాలి. ఏకాదశి రోజు చేయటం వల్ల మంచి ఫలం కలుగుతుంది. ఆర్థిక స్థితిని బట్టి తొమ్మిది, పద్దెనిమిది ఇలా కూడా శ్రీకృష్ణుణ్ని పూజించి సమర్పించవచ్చు. ఇలా శ్రీకృష్ణాష్టమికి చెయ్యటం వల్ల సత్వర ఫలితం కలుగుతుంది.

## చింతతొక్కు...పులుసులతో నైవేద్యాన్ని సమర్పిస్తే

తిరుమల శ్రీవేంకటేశ్వరునికి పూజాదికాలు చేసి చింతతొక్కు పచ్చడి, పులుసులతో భోజనాన్ని నైవేద్యంగా సమర్పిస్తే మీకు హాని చెయ్యాలనుకున్నవారు కూడా హితమే చేస్తారు. ఇలాగే శుక్రాచారి శ్రీనివాసునికి భోజనాన్ని సమర్పించి ఫలితాన్ని పొందాడు. ఇది భవిష్యత్తు పురాణం లోని గాథ.

## శ్రీపద్మావతీ శ్రీనివాసుల కళ్యాణంలో ఎవరెవరకి ఏ బాధ్యతలు

బంధుమిత్రహితుల వివాహాల్లో సంబంధిత పనులను భుజాన వేసుకోవటం ద్వారా ఆధిపత్యం కలుగుతుంది. తిరుమల శ్రీనివాసుని కళ్యాణంలో అగ్ని దేవునికి వంటకార్యక్రమాన్ని శ్రీనివాసుడు అప్పచెప్పాడు.

అలాగే వచ్చిన అతిథులకి మర్యాదలు చేయమని ఆరు ముఖాలు గల షణ్ముఖ దేవునికీ, సకల సౌకర్యాలు చేసేందుకు విశ్వకర్మనూ, ఇక అతిధులకు ఆహ్లాదం కలిగించే పనిని వాయుదేవునికీ అప్పగించాడు. అలా శ్రీనివాసుని కళ్యాణంలో ఇతోధికంగా కార్యాలను చెయ్యటం వల్ల కలియుగమంతా వారికి ఆధిపత్యం స్థిరమయ్యింది.

## నైవేద్యం పెట్టిన లడ్డు

ఈ మహిమాన్వితమైన ప్రసాదాన్ని ధన సంబంధిత ప్రదేశాల్లో పెట్టుకుంటే ధనవృద్ధి.. అలాగే వ్యాపార సంబంధిత వస్తువులపై చల్లితే మరింత నాణ్యత... పంటపొలాల్లో చల్లితే ఎక్కువ దిగుబడి.. సంతానం లేని వారు తింటే కీర్తి, ధనం సంపాదించే సంతానము.



## నూతన వధువు చెయ్యాల్సిన పూజ

నూతన వధువు కొత్తగా అత్తగారింట అడుగు పెట్టిన రోజు శ్రీలక్ష్మీనారాయణుల పూజ చేసి ఆపై తులసిచెట్టును పూజిస్తే ఆ ఇంట ధన సంబంధిత విషయాలలో లోటు కలుగదు. ఆర్థికపరమైన బాధలూ, సమస్యలూ దరిచేరవు.

## అష్టైశ్వర్యాల కోసం అనంతపద్మనాభ వ్రతం

భాద్రపద శుక్ల చతుర్థశి నాడు ఈ వ్రతాన్ని చేస్తే సకల భోగాలను ఇచ్చే శ్రీలక్ష్మీదేవి కటాక్షిస్తుంది. కృతయుగంలో భృగుమహర్షి పుత్రికయిన దీక్ష పుత్రిక శీల ఈ వ్రతం చెయ్యటం ద్వారా మహాలక్ష్మీ దేవి అనుగ్రహం పొంది అష్టైశ్వర్యాలను పొందింది. ఈ రోజే అనంత లక్ష్మీ పూజ కూడా చేస్తే ఆ వైకుంఠ పుర నివాసితులు శ్రీలక్ష్మీనారాయణులు సుఖ సంతోష ధన కనక వస్తువులను అనుగ్రహిస్తారు.

## అందమైన భార్య కావాలనుకుంటే

అందమైన భార్య కావాలనుకునేవారు శ్రీమహాలక్ష్మిని తేనెతో అభిషేకించి, నివేదన చేస్తే మంచి అందగాడు, బాగా చూసుకునేవాడు భర్తగా లభిస్తాడు.

## ధన సంబంధిత దుఃఖాలు పోవాలంటే

మహా దుఃఖాలు పోవటానికి శ్రీఆదిలక్ష్మికి పాలతో అభిషేకము, మరియు పాలతో చేసిన పదార్థములను లేదా అప్పాలను నైవేద్యంగా పెట్టి అమ్మను పూజిస్తే దుః ఖాలు తొలగి సుఖశాంతులు కలుగుతాయి.

## వ్రత, నోముల్లో కట్టుకున్న తోరమును చులకన చేస్తే

పూర్వము తన భార్య వ్రతం చేసి కట్టుకున్న తోరమును అవమానించి అనుమానించనందుకు కౌండిన్యుడి సంపదలూ, శాంతీ పోయాయి. తిరిగి వాటిని పొందటానికి అష్టకష్టాలూ పడ్డాడు. కాన వ్రత పూజాదికాల నిర్వహణలో కట్టుకున్న తోరములను పూలచెట్ల మీద, నదుల్లో వేయాలి. దోషపూరితమైన ప్రదేశాల్లో వేసి లక్ష్మీదేవి కోపానికి గురికావద్దు.

## శ్రీలక్ష్మీనారాయణికి నైవేద్యంగా సమర్పించే పేలాల ఉండలు

రెండు కప్పుల పేలాలను తీసుకుని తీపికి సరిపడ బెల్లం తీసుకొని అన్నింటినీ కలిపి మెత్తగా దంచుకోవాలి. వీటిని ఉండలుగా చేసి అమ్మకి నైవేద్యంగా సమర్పించాలి.



## కోజుగాగౌరీ వ్రతము

ఈ వ్రతాన్ని వాలిఖిల్య మహర్షి శెలవిచ్చాడు. అశ్వియుజ మాసము పౌర్ణమి నాడు చేయాలి. భార్యతో సకల వైభోగాలను పొందటానికి పూర్వము ఉద్దాలకుడు ఈ వ్రతాన్నే చేశాడు. వ్రతపూజలయ్యాక గవ్వల ఆట ఆడాలి. గవ్వల క్రీడ లక్ష్మీదేవికి అత్యంత ప్రీతికరమైనది. గవ్వలు, చంద్రుడు లక్ష్మీదేవికి తోబుట్టువులు. ఈ వ్రతంలో గవ్వలాడటంలో పరమార్థం శ్రీమహాలక్ష్మి తన పుట్టింటికి వచ్చినట్టు ఆనందంగా సంతోషంగా ఇష్టంగా వస్తుందని.

**మీరు అన్ని రకాలుగా నష్టపోయారు... ఏ వైపు చూసినా దారి కనపడటం లేదు.. అలాంటప్పుడు పాత వ్యక్తులను దూరంగా ఉంచి మీరు దూరంగా ఉండండి... కొత్త పరిచయాలు, కొత్త వ్యక్తుల సన్నిహిత్యము, స్నేహము మళ్ళీ మీ వైభవాన్ని తిరిగి తెస్తుంది.**

## శ్రీమహాలక్ష్మికి ఏఏ ఫలితాల కోసం ఏఏ నైవేద్యాలను అర్పించాలి

ధన సంబంధిత దోషాలు అనగా దొంగతనము, మోసం వంటివి పోవాలంటే బెల్లపు అభిషేకమును శ్రీ లక్ష్మీనారాయణులకు చేయించాలి. వాటితో చేసిన పదార్థములను నైవేద్యంగా పెడితే ఫలితము వుంటుంది.

వ్యాధులు నయమవుటకు : పెసరపప్పు, మిరియాలు, నెయ్యి వంటి వాటితో చేసిన పులగం నివేదించాలి.

దీర్ఘాయువుకొరకు : దద్యోజనము... అనగా పెరుగు కలిపిన అన్నములో పోపు పెట్టి ఆపై సమర్పించిన ఫలితము కలుగును.

మహాదుఃఖాలు పోవటానికి : బెల్లంపొంగలి చేయాలి. పొంగలిని బెల్లంతో చేసి అమ్మవారికి అర్పించాలి.

ఉన్నత స్థితికి : నేతి అన్నాన్ని నివేదించాలి. అందులో మాత్రం పోపు పెట్టేటప్పుడు నెయ్యి వాడాలి.

అందమైన భార్యా లేదా భర్త కోసం పాయసాన్నమును నివేదించి మిత్రులకూ, హితులకూ ఇవ్వాలి.

మహాదుఃఖాలు పోవటానికి పులిహోరను నైవేద్యంగా ధనలక్ష్మికి సమర్పించి పూజించాలి.



సుఖశాంతుల కోసం పాయసము, పులిహోరలను నైవేద్యంగా సమర్పించాలి.

పుణ్యతీర్థాల దర్శనము కోసము, సుఖప్రయాణము కోసం బెల్లంతో చేసిన పాయసము, (గుడాన్నం) పెరుగన్నం, పులిహోరలను నివేదించాలి.

సమస్త సుఖాల కోసం, ధన కీర్తిల కోసం పైన చెప్పినవన్నీ యథాశక్తిగా నివేదించి శ్రీలక్ష్మీదేవిని పూజిస్తే మీ సంకల్పం సిద్ధిస్తుంది.

## ఆకాశరాజు శ్రీనివాసునికి ఇచ్చిన కట్నము

భవిష్యోత్తర పురాణం ప్రకారము ఆకాశరాజు శ్రీనివాసునికి వంద తులాల కనక కిరీటము, మరో వంద తులాల నడుంపట్టీ, ఇంకా భుజ కీర్తులు, నూపురములు. నాగభుజ భూషణాలు రెండు, ముత్యాల కర్ణాభూషణాలు, నవరత్న ఖచిత కంకణము, నాగభూషణద్వయము, బంగారు వజ్ర కటిసూత్రము...(ఇది నూటపదకొండు తులములు కలిగినది), పాదుకలు, ఇంకా అరవై తులాల భోజన పాత్రతో పాటు పట్టు వస్త్రాలు, పంచపాత్రలు ఇచ్చి బృహస్పతి వశిష్ఠులు వేదమంత్రాలు చదువుతుండగా వశిష్ఠ గోత్రీకుడైన శ్రీనివాసునికి పద్మావతీ దేవినిచ్చి కన్యాదానం చేశారు ఆకాశరాజు, ధరణీదేవులు.



## శ్రీమహాలక్ష్మికి అర్పించిన చీరలు...

అమ్మవారికి సమర్పించిన వస్త్రాలను నిత్యం వాడుకగా ధరించకూడదు. వరలక్ష్మీ, మంగళగౌరి, వ్రత నోముల్లో ధరించి పూజాదికాలు నిర్వహించుకోవాలి. కొంతమంది అమ్మవారికి సమర్పించిన వస్త్రాలని వివాహాది కార్యక్రమాల్లో అనగా అడ్డుతెరలుగా వాడతారు అది తగదు.

## ఎలాంటి వారి వల్ల సంపదలు వృద్ధి అవుతాయి

ఓర్పుగలవారి వల్లా, మద్యం, జూద, స్త్రీ వ్యసనాలు లేని వారి వల్లా, ధర్మశాస్త్రాలు తెలిసిన వారి వల్లా, వాటిని ఆచరించే వారి వల్లా, పొగరూ పేరాశలు లేని వారి వల్లా, నియమనిష్ఠలు కలవారి వల్లా, మాటతీరూ, పనితీరూ చక్కగా వుండే వారి వల్లా మరియు ఇట్టి సేవకులు ఉండే వారి వాల్ల సంపదలు వృద్ధి అవుతాయి.

యజమానికి చాడీలు చెప్పే వారి వల్లా, మందకొడుల వల్లా, పిరికి వారి వల్లా, తెగింపు లేని వారి వల్లా, నీతిమాలిన వారి వల్లా, స్త్రీల గూర్చి చెడుమాటలు మాట్లాడే వారి వల్లా, అబద్ధాలాడే వారి వల్లా యజమాని తన సంపదలు పోగొట్టుకుంటాడని నీతిశాస్త్రం శెలవిస్తోంది.





## హనుమంతుని కోపం....

కోపానికి మించిన శత్రువు మరొకటి మనిషికి లేదు. హనుమంతుడు తన తోకకు రాక్షసులు నిప్పంటినందుకు కోపంతో లంకను అగ్నికి ఆహుతి చేస్తాడు. ఆపై సీతాదేవికి అపకారం జరిగి వుంటుందని భావిస్తాడు. తోకను సముద్రంలో ముంచి చల్లార్చుకుని, ఆపై విచారిస్తాడు. సీతా మహాసాధ్వి కూడా లంకలో వున్న విషయం ఎలా మరిచానా అని వ్యధ చెందుతాడు. తను వచ్చిన విషయాన్ని మరిచి ఆవేశకోపాలకి లోనవ్వటం వల్ల అంతటి అనర్థం జరిగిందని భావిస్తాడు. చేసిన పనికి తనకితానే ఆహుతవ్వాలనుకుంటాడు కూడా... ఆ తర్వాత శ్రీరామునిపై వున్న భక్తి వల్ల సీత క్షేమంగా వుందని తెలుసుకొని స్థిమిత పడతాడు. కాన కోపం చెయ్యకూడని, మాట్లాడకూడని మాటలని ఎంతటి సత్పురుషుడి చేతనైనా చేయిస్తుంది. అగ్నిని నీళ్ళు చల్లి ఆర్పినట్టు కోపాన్ని అణుచుకున్నప్పుడే కార్యసిద్ధి కలుగుతుంది. సర్పం కుబుసాన్ని విడిచిపెట్టినట్టు కోపాన్ని విడిచిపెడితేనే పుణ్యం ... సంపదలు... విజయం.

## కుబేరుని వద్ద ఉన్న నవనిధులు

వీటివల్లే కుబేరునికి సకల సంపదలు నిలిచాయి. మహాలక్ష్మీదేవి ప్రసాదించిన నవనిధుల్లో మొదటిది పద్మము, మహాపద్మము, శంఖం, మకరం, కచ్ఛపం, ముకుందం, నీలం, కుందం, వరం.

## గోమాత పూజ మహాసంపదల సిద్ధి

గోమాతను పూజించేటప్పుడు ఎదురుగా గాక పక్కన వుండి పూజాదికాలు, ఆహారములను అందించాలి. ఎందుకంటే గోమాత ముఖం నందు శ్రీమహాలక్ష్మీదేవి అక్క జ్యేష్ఠాదేవి ఉంటుంది. గోవుకి ఆహారం పెట్టడమంటే సర్వ దేవతలకి ఆహారాన్ని సమర్పించినట్టే. అలాగే గోమాత చుట్టూ ప్రదక్షిణం చేస్తే భూమండలాన్ని ప్రదక్షిణ చేసిన ఫలం వస్తుంది.

## ధనకనకాది భోగాలకి చెయ్యాల్సిన స్నానం

తిరుమలలో పాపవినాశనం వద్దకు వెళ్లే దారిలో జాపాలి తీర్థము వుంది. ఇక్కడ జాపాలి మహర్షి తపస్సు చేశాడు. వాని తపస్సుకు మెచ్చి ఆంజనేయస్వామి ప్రత్యక్షమయ్యాడు. స్వయంభువుగా వెలిశాడు. ఈ ఆలయానికి తూర్పున, పడమరన శ్రీరామతీర్థం, సీతమ్మ తీర్థాలున్నాయి. ఈ తీర్థాలలో స్నానమాచరిస్తే మహాదోషాలూ, పాతకాలు తొలగిపోతాయి. ధనం ఇంకా బంగారం దొంగలించిన పాపాలు సమసిపోతాయి. శుభాలు జరుగుతాయని శాస్త్రం. ఇంకా ఈ తీర్థస్నానం వల్ల పరస్త్రీని కలిసిన దోషం, పాపాత్ములతో కూడిన దోషాలు పోయి సుఖాలు కలుగుతాయి.



## డబ్బుంది కదాని మరో చిన్న ఇల్లు...

**సిరిగలవానికి జెల్లును**

**తరుణులు బదియారువేల దగ**

**బెండ్లాడన్**

**తిరిపెమున కిద్దరాండ్రా**

**పరమేశా గంగ విడుము**

**పార్వతిచాలున్**

శ్రీనాథుడు చెప్పిన పద్య భావమిది! ధనముంటే పది వేల మంది భార్యలున్నా పర్వాలేదు, పరమేశా నీకెందుకు... బిచ్చమెత్తుకునేవాడికి ఇద్దరెందుకు పార్వతిని ఉంచుకొని గంగను వదలుము. అలా పద్యం పాడితే గంగ ఉవ్వెత్తున లేచింది. కరువుతో అల్లాడుతున్న తన ప్రాంతం గూర్చి చెప్పిన పద్యం. అంతే కాని ధనముంది కదాని శ్రీనాథుడు చెప్పాడని ఇళ్ళు పెంచుకుంటూ పోతే ప్రతిఫలంగా.. శోకం.. దిగులు.. వెరసి ధనం సమస్తం పోయి బిచ్చమెత్తుకోవటానికి కూడా పనికి రాకుండా పోయే పరిస్థితి వస్తుంది.

## భృగునందినికి నైవేద్యంగా సమర్పించే నేతిగారెలు చేసే విధానము

తలారాస్నానం చేశాక, శుభ్రతగల పాత్రలను సిద్ధం చేసుకోవాలి. ఓ పావుకిలో మినపప్పును నాలుగైదు గంటల ముందు నానబెట్టుకుని వుంచుకోవాలి. జీలకర్ర, నెయ్యి, ఉప్పు తగినంత సిద్ధం చేసుకోవాలి.

నానిన పప్పును వడగట్టి రుబ్బుకోవాలి. ఆపై జీలకర్ర, సరిపడినంత ఉప్పు వేసి బాగా కలిసేలా కలుపుకొని వత్తి కాగిన నేతిలో వేసుకొని గారెలు తయారుచేసుకోవాలి. శ్రీమహాలక్ష్మీదేవికి బంగారు వర్ణంగల నేతిగారెలన్న ప్రీతి. బంగారు రంగు వర్ణంలో వేగిన గారెలను తీసి శ్రీవిష్ణుసతిని పూజించి నివేదించాలి.

**ఉన్నత విద్యాప్రాప్తికీ, లక్ష్మీప్రాప్తి కొరకు శ్రీవైకుంఠనివాసి సతికి అరటి పళ్ళను నైవేద్యంగా పెట్టి పదుగురికీ పంచితే తత్ఫలితము సిద్ధిస్తుంది.**



## శ్రీమహావిష్ణువు గరుడ వాహనధారుడై మూడుకోట్ల దేవతలతో భూలోకానికి వచ్చిన రోజు...

ధనుర్మాసంలో వచ్చే శుక్లపక్ష ఏకాదశే వైకుంఠ ఏకాదశి. అదే ముక్కోటి ఏకాదశి. ఈ ఏకాదశిలో ఉపవాసం, అలాగే ద్వాదశిలో అన్నదానం మహా పుణ్యఫలాన్ని ఇస్తాయి. ఈ రోజు శ్రీమహావిష్ణువు ముక్కోటి దేవతలతో భూలోకానికి వచ్చే పవిత్రమైన రోజు. ఈ ముక్కోటి ఏకాదశి మూడుకోట్ల ఏకాదశులతో సమానం. లక్ష్మీ సమేతుడైన శ్రీమహావిష్ణువుని పూజించి, ఉపవాసం ఉండి, ఆ ఉపవాస సమయంలో కేవలం తులసి తీర్థం మాత్రమే సేవించి ఆపై అతిథితో భోజనం చెయ్యటం వల్ల కీర్తి, వైభవం, ధనం కలుగుతాయి. ఆనాటి ప్రదక్షిణ ముక్కోటి ప్రదక్షిణలతో సమానం. ఆనాటి వ్రతం కీర్తి, ధనాన్ని పొందే సంతానాన్ని కూడా ఇస్తుంది. ఈ ముక్కోటి ఏకాదశినే పుత్రద ఏకాదశి అని కూడా అంటారు. ఏడు సంవత్సరాల లోపు పిల్లలు, డెబ్భయి సంవత్సరాల వయసు వారూ ఈ రోజు ఉపవాసం చేయకపోయినా స్వామిని దర్శించి పూజించినంతనే ఉపవాస ఫలం కలుగుతుంది.

# క్షీరసముద్రరాజ తనయికి దద్ధోజనం నైవేద్యంగా సమర్పించే విధానము

ఆ ఆదిలక్ష్మికి నైవేద్యంగా సమర్పించే దధ్యోజనమునకు మూడు కప్పుల గట్టి ముంత పెరుగు, రెండు కప్పుల బియ్యం, మూడు చెంచాల నేయి, అలాగే మినపప్పు, శెనగపప్పు, జీలకర్ర, ఆవాలు ఒక చెంచా చొప్పున ఇంకా సరిపడ పచ్చిమర్చి, ఎండుమిర్చి, కరివేపాకు, కొత్తిమీర, అల్లం, ఉప్పులతో పాటుగా అయిదారు మెంతులు వేయాలి.

నైవేద్యానికి ఉపయోగించే బియ్యాన్ని శుభ్రంగా శుచి గల పాత్రలో పోసి బాగా కడగాలి. ఆపై రోజుటిలా అన్నం వండాలి. ఆ తర్వాత వండిన అన్నాన్ని ఓ పళ్ళెంలోకి తీసుకోవాలి. అన్నం చల్లారిన తర్వాత పొయ్యి మీద బాండీ పెట్టి నెయ్యి వేయాలి. వేడయిన నేతిలో పోపుకు సంబంధించిన వాటిని వేసుకోవాలి. అవి వేగిన తర్వాత సన్నగా తరిగిన పచ్చిమిర్చి, ఎండుమిర్చి, అల్లం ముక్కలు వేసి సరిపోయేంత వరకు వేపుకొని ప్రక్కన ఉంచాలి. ఇప్పుడు చల్లారిన అన్నంలో సరిపడ ఉప్పు, పెరుగు వేసి కలిపి వేపిన పోపును కలుపుకొని కొత్తిమీరతో అలంకరించి చక్కటి గిన్నెలోకి తీసి అమ్మవారికి నైవేద్యంగా సమర్పించాలి. మధ్యలో రుచి చూస్తే నైవేద్యంగా సమర్పించకూడదు.



# శుక్రవారం లక్ష్మీదేవికి ఎందుకంత ప్రీతి

రాక్షస గురువు శుక్రాచార్యుని పేరు మీద ఏర్పడిందే శుక్రవారం. ఈ శుక్రాచార్యుని తండ్రే భృగుమహర్షి. రాక్షస గురువు శుక్రాచార్యుడు లక్ష్మీదేవికి చంద్రుడితో పాటు సోదరుడు కూడా. రాక్షసులను సంహరించే శ్రీమహావిష్ణువు భార్యకి రాక్షస గురువు శుక్రాచార్యుడు సోదరుడు. అయినా శ్రీమహావిష్ణువు సహితం భార్య పుట్టింటి ప్రేమను మన్నించి, గౌరవించి ఆ రోజు లక్ష్మీదేవిని పూజించేవారికి తన కృపను కలిగిస్తాడు. లక్ష్మీదేవి ప్రసన్నత లేకుండా శ్రీమహావిష్ణువుని ఎంత ప్రార్థించినా, తపస్సు చేసినా వరాలివ్వడని వివిధ కల్పాలలో శెలవిచ్చారు.

## నిత్యాన్నపాయినిని పూజిస్తే

నిత్య మంగళము, శుభమంగళ, నిత్యాన్నపాయిని అనగా ఎన్నడూ శ్రీమహావిష్ణువుని వీడనిది లక్ష్మి అని. అన్ని వేళలా భర్తకు తోడుగా, నీడగా నిలిచింది. ప్రతిగృహిణి నిర్వర్తించే పూజాదికాల్లో జరిగే దోషాలని ధనాధిదేవత చూసీ చూడనట్టు వూరుకుంటుంది. కానీ భర్తను నిందించినా, విడిచినా, చులకన చేసినా ఆ స్త్రీ చేసిన దోషాలను ఎన్నో రెట్లుగా పరగణించుకుని మహా ధన కష్టాలను పెడుతుంది.

## మార్గశిరమాసంలో ప్రతి గురువారం లక్ష్మీదేవికి ప్రీతికరం

గురువారం గృహాన్ని గోమయంతో అలికి లక్ష్మీ పాదములు ముగ్గులుగా పెట్టి లక్ష్మీదేవిని పూజించటం వల్ల కలిగే ఫలాలని నారదునికి పరాశరమహర్షి ఈ విధంగా చెప్పాడు. పూలు, గంధము, ధూప దీపాలతో అమ్మని పూజించి పాలు, అన్నము, పిండి వంటలు, కూరలతో నైవేద్యం సమర్పించి, ఆపై ప్రసాదాన్ని పదుగురికీ ఇవ్వటం వల్ల శ్రీలక్ష్మీ కటాక్షం సిద్ధిస్తుంది. అలాగే రాత్రిపూట పెరుగన్నము తింటే ఆ గృహంలో ధనం తరిగిపోతుంది.

– గురువారం నూనెతో వంటలను చేయకూడదు.

– రాత్రిపూట పెరుగన్నం తినకూడదు.

– నిద్రలేచిన తర్వాత వెంటనే స్త్రీ ముఖాన్ని కడుక్కోవటం శుభకరం. ఆపై ఆమెను చూసి కార్యార్థియై వెళితే విజయం తథ్యం.

– గృహిణి భోజనాన్ని దక్షిణ ముఖం పెట్టుకొని భుజించకూడదు. అలాగే చీకటి పడ్డ తర్వాత తలకి నూనె రాసుకోకూడదు. అలా చేస్తే ధనధాన్యాలు నిండుకుంటాయి. భర్తతో చికాకులు వస్తాయి.



## కర దర్శనము ఎంతటి పుణ్యం

శ్లో॥ కరాగ్రే వసతే లక్ష్మీ కరమధ్యే సరస్వతి
కరమూలేతూ గోవింద ప్రభాతే కరదర్శనం

అనగా శ్రీమహాలక్ష్మీదేవి అరచేతి చివరా, మధ్యలో చదువుల తల్లి సరస్వతి, మొదట గోవిందుడూ ఉంటారు. కాన కరదర్శనము అనగా లేవగానే అరచేతిని దర్శించటమంటే లక్ష్మీసరస్వతులను పూజించినంత ఫలం.

## లక్ష్మీదేవిని శ్రీమహావిష్ణువు మెచ్చుకుని...

ఇచ్చిందే, చెప్పిందే 'ఏకాదశి' పుణ్యవ్రత విధానం. విష్ణువు నిద్రపోతున్నాడని తలచి, మురాసుడనే రాక్షసుడు సంహరించపోతే ఆదిలక్ష్మి మహోగ్రరూపం ధరించి ఆ రాక్షసుడిని సంహరించింది. అప్పుడు శ్రీమహావిష్ణువు లక్ష్మీదేవిని అభినందించి ఇచ్చిన బిరుదే ఏకాదశి. వైఖానసుడనే మహారాజు పర్వత మహర్షి చెప్పిన విధంగా ఏకాదశి వ్రతం చెయ్యటం ద్వారా మహా వ్యధల నుంచి ఆతడూ, ఆతని పూర్వీకులూ సుఖాలను పొందారు. అప్పుల బాధ నుంచి విముక్తులవుతారు.

## మీ పిల్లలకి లక్ష్మీదేవి పేర్లు పెట్టుకోవటానికి

విమల, పద్మ, పద్మప్రియ, కమల, పద్మమాల, పద్మముఖి, చంద్రవదన, పద్మాక్షి, పద్మహాస, పద్మసుందరి, భార్గవి, శ్రీదేవి, రమాదేవి, అదితి, జలజ, ఐశ్వర్య, రమా, దీప, పద్మిని, హరిప్రియ, హరిణి.... ఇలాంటి ఎన్నో పేర్లు శ్రీలక్ష్మీఅష్టోత్తర సహస్రనామాలు చదివితే మీ అభిరుచికి తగ్గట్టుగా లభిస్తాయి.

## శ్రీ యంత్రం ద్వారా సర్వ సిద్ధులు

శ్రీయంత్రం సకల దేవతా స్వరూపమే. 'శ్రీ' అనగా వైకుంఠపతి శ్రీమహావిష్ణువు తన సతి లక్ష్మీదేవితో కూడి వున్నాడని అర్థం. శ్రీ అనేది ఆదిలక్ష్మి బీజాక్షర మంత్ర మహా స్వరూపము కూడా. అలాగే 'యం' అనగా ఓంకార స్వరూపం. మహాశివుడు, ఆదిపరాశక్తి సంయుక్త అక్షరమే 'యం'. ఇక 'త్రం' అంటే సకల దేవతా బీజాక్షర మంత్ర స్వరూపము. యంత్రరాజం ఇలా చెబుతోంది.. సకల ఐశ్వర్యాలకీ, భోగాలకీ, కీర్తికీ, సుఖాలకీ యంత్రములలో కెల్లా ఎక్కువ సిద్ధినిచ్చే 'శ్రీ యంత్రం' ను పూజించమని. సకల సిద్ధులనూ సిద్ధింపచేసే 'శ్రీయంత్రం'ను పూజించటం వల్ల మీ కోర్కెలు వెనువెంటనే తీరుతాయి.



## దీప స్వరూపిణి శ్రీలక్ష్మీదేవి

శ్రీమహాలక్ష్మిని దీపాలతో అలంకరింప చేసి ఆపై పూజించటం వల్ల అష్టదరిద్రాలూ తొలగిపోతాయి. దీపావళి రోజున కొల్హాపూర్ లోని పంచగంగలో స్నానమాచరించి శ్రీమహాలక్ష్మీదేవిని అఖండమైన దీప వెలుగుల్లో దర్శనం చేసుకుంటే మహాఫలం ఇంటిల్లిపాదినీ వరిస్తుంది.

## నిజమైన అబద్ధం

అసత్యం శ్రీమహాలక్ష్మీదేవికి అస్సలు నచ్చదు. ఎన్నో విధాలుగా ధనహీనతను కలిగిస్తుంది. పక్కజీవికి ఆపద కలిగించే నిజం చెప్పాల్సిన పరిస్థితి వచ్చినప్పుడు సుదర్శనుడు శ్రీదేవీభాగవతంలో ఇలా చెబుతాడు. నా కళ్ళు చూశాయి. కానీ అవి చెప్పలేవు. నా నోరు చెప్పగలదు. కానీ అది చూడలేదు అని అంటారు. వేటగాడికి అర్థంకాక వెళ్ళిపోతాడు. వాగ్దేవి పరమానందం చెంది ఓ జీవిని వేటగాడి నుంచి కాపాడినందుకు సకల ఇష్టాలనూ తీరుస్తుంది. కాన బాధపడేదీ, పక్కవారికి హాని కలిగించే నిజం చెప్పటం కూడా దోషమే. అలాగే అది అబద్ధమైనా పక్కవారు బాధపడేది కాకుంటే అది దోషం కాదు.

## పురుషునికి సప్త సంపదలు రావటానికి కారణం

భార్య అనగా గృహిణి వల్లే పురుషునికి సకల సుఖాలూ, సంపదలూ వస్తాయి. శాస్త్రం ప్రకారం ధర్మపత్నిలో కీర్తిదేవి, శ్రీదేవి, వాగ్దేవి, స్మృతీదేవి, మేధాదేవి, ధృతీ దేవి, క్షమాదేవిల లక్షణాలుంటాయి. ఆ ఏడు శుభలక్షణాల వల్ల పురుషునికి సంపదలు వృద్ధి అవుతాయి.

కీర్తిదేవి, మేధాదేవి, ధృతీదేవులు యముని భార్యలు. ఇక స్మృతీదేవి అంగీరసుని భార్య. శ్రీక్షమాదేవి పులహూతుని ధర్మపత్ని. అలాగే సంపదలకు అధిదేవత శ్రీదేవి శ్రీమహావిష్ణువు భార్య. వాగ్దేవి బ్రహ్మ భార్య. ఇందులో ఒక్క శ్రీదేవి మాత్రం మనువు పుత్రిక. దక్షప్రజాపతి భార్య ప్రసూతీల పుత్రిక కాదు. శ్రీదేవీ సప్తకంలో ఈ రహస్యం పొందు పరిచి వుంది. కాన స్త్రీయే అనగా భార్యవల్లే అనగా ఆమె ప్రవర్తనా, లక్షణాల వల్లే పురుషుడు సంపదలను పొందగలడని భావన.

## ధనం... శక్తి.. జ్ఞానములకొరకు

శ్రీమహాలక్ష్మి, పార్వతి, సరస్వతుల రూపమే శ్రీవైష్ణవీదేవి. ఈ తల్లిని పూజించటం ద్వారా, ఆరాధించటం ద్వారా ధనం.. శక్తి.. జ్ఞానములు సిద్ధిస్తాయి.



## దరిద్రులు సహితం శ్రీమంతులయ్యేది..

అనంత కళ్యాణ గుణ సంపన్నుడైన శ్రీమహావిష్ణువును పూజించిన దానికంటే మహా నైవేద్యాలను పెట్టిన దానికంటే యజ్ఞ యాగాదులు చేసిన వాటికంటే గొప్పది శ్రీహరి నామస్మరణ. పదిమందితో కలిసి స్మరించటం వల్ల దరిద్రుడైనా సరే ధనవంతుడవుతాడని శ్రీభాగవతం శెలవిస్తోంది. మహా యజ్ఞాల కంటే పవిత్రమైన కార్యమది. భక్తి పూర్వకంగా చేసిన స్మరణ ఎంతటి చండాలుడ్నయినా మహా పవిత్రుడ్ని చేస్తుంది. అలాగే కపిల దేవహూతి సంవాదం దీన్నే కపిల ప్రోక్తమైన యోగశాస్త్రం అని కూడా అంటారు. ఆ ఉపాఖ్యానం చదవటం వల్లా, వినటం వల్ల సకల పాపాలూ, దోషాలూ తొలిగి సుఖసంతోషాలు కలుగుతాయి.

## గుడ్లగూబ

– శ్రీమహాలక్ష్మీదేవి వాహనము.

– ఆ గుడ్లగూబ అపశకునం పక్షి అని కొంతమంది అనుకుంటారు కాని కాదు.

– ఈ గుడ్లగూబ మానవులకి హాని కలిగించే ఎన్నో ప్రాణులను తింటూ మానవజాతికి మంచి చేస్తుంది.



## ప్రభావతీ ప్రద్యుమ్నములో జరిగినట్టు సహనమే సకల సంపదలను తిరిగి తెప్పిస్తుంది

అష్టభోగాలనూ, ఐశ్వర్యాలనూ అనుభవిస్తున్న ఇంద్రుడిపైకి వజ్రనాభుడు విరుచుకుపడి స్వర్గాధిపతిని సామాన్య మానవునివలే మహా కష్టాలు పెట్టాడు. నందనవనంలోని దివ్యవృక్షాలని విరిచాడు. సంతానమను వృక్షాలకి మాంసపు ఖండాలను వేలాడదీశాడు. హరిచందన వృక్షాలను ఛిన్నా భిన్నం చేసి ఏనుగులను కట్టేశాడు. రంభాది అప్సరసలను పంపమన్నాడు. మందారతరులపై మలిన వస్త్రాలను ఆరవేశాడు. అయినా ఇంద్రుడు సహనం వహించాడు. శ్రీకృష్ణుడితో చెప్పుకున్నా ఫలితం లేకపోయింది. స్వంత నగరిలోనే పనివాడయ్యాడు. ఆ సహనానికి ఫలంగా వజ్రనాభుని పుత్రికైన ప్రభావతిని వివాహం చేసుకున్న ప్రద్యుమ్నుడి చేతిలో హతమయ్యాడు రాక్షసరాజు. కాన పరిస్థితులు అనుకూలంగా లేనప్పుడు ఆవేశపడటం కంటే సహనంగా వుంటే ఇంద్రునిలా తిరిగి సకల వైభోగాలూ పొందగలరు.





## నీరసంగా ఉండద్దు... కనిపించవద్దు...

ధన సమస్యలు... అంతకి మించిన సమస్య మరేమీ లేదు. ఎప్పుడూ ఒక్కటే గుర్తు పెట్టుకోండి. సమస్య మీకే కాదు భూమిపైన పుట్టిన ప్రతి మనిషికీ వుంది. దేశాలకి, రాష్ట్రాలకి వుంది. అంతమాత్రాన మీరు డల్‌గా వుంటే మీ కుటుంబం డల్‌గా వుంటుంది. మీ స్నేహితులు డల్ అవుతారు. మీ స్టాఫ్... నీ... అనే వారంతా వీక్ అవుతారు. దాంతో ఖచ్చితంగా వెనకబడిపోతారు. మీరు గెలవలేరు. విజయాన్ని పొందలేరు. సకల సంపదలు పోయినా నలుడు మొహం మీద నిబ్బరాన్ని పోనివ్వలేదు. అందుకే అన్నింటినీ తిరిగి పొందాడు. సకల సామ్రాజ్యమూ, తన అనుకునే వారంతా దూరమయ్యే పరిస్థితి వచ్చినా, అలెగ్జాండర్ ఎక్కడా వెనకడుగు వేయలేదు. మొహం మీద ధీరగాంభీర్యాలు చెక్కు చెదరనివ్వలేదు.

## బిల్వదళము కోసినపుడు పఠించాల్సిన శ్లోకం

త్రిదళం త్రిగుణాకారం త్రినేత్రం చత్రియాయుషం

త్రిజన్మ పాపసంహారం ఏకబిల్వ శివార్పణం.

## చెదపడితే...

మీ గృహంలో సమస్యలు... భంగపాటు, నిందారోపణలు అన్నీ కలిసి మిమ్మల్ని ధనహీనుడ్ని చేస్తాయి. గృహంలో చెద మంచిది కాదు. అది దరిద్రాన్ని మోసుకువస్తుంది. వెంటనే సమసిపోయేలా చూసుకోండి. శ్రీమహావిష్ణువు అంతటి వాడ్ని అతలాకుతలం చేసింది చెద. ఎంతలా చేసిందో శ్రీదేవీ భాగవతము చదివితే తెలుస్తుంది.

## దశమి శుక్రవారం... శ్రీమహాలక్ష్మీదేవి ఇంటికి వచ్చేరోజు

శుక్రవారం దశమి మరింత లక్ష్మీప్రదం. కాన ఆ రోజు బద్ధకంవల్లా, సమస్యల వల్లా గానీ అపరిశుభ్రతగా వుండవద్దు. లేనిపోని విషయాల్లో గొడవలు పడద్దు. శ్రీమహాలక్ష్మి వచ్చే సమయంలో పరిసరాలను శుభ్రంగా వుంచాలి. చెడు వద ప్రయోగాలు చేస్తూ మాట్లాడుకోవటం, అరుచుకోవటం ఇత్యాదివి చేస్తే ఆ తల్లి తన రాకను మరోసారి వాయిదా వేసుకుంటుంది. తన అక్క జ్యేష్ఠాదేవిని ఓసారి బైటినుంచే పలకరించి వెళ్ళిపోతుంది.



## దీపలక్ష్మి దీపావళి విశిష్ఠత

– విక్రమశకస్థాపకుడు విక్రమార్క చక్రవర్తికి పట్టాభిషేకం జరిగిన రోజు.

– ఈ దీపావళి రోజున దీపమాలికలతో శ్రీలక్ష్మీదేవికి ఇచ్చే నీరాజనం మహా ధనప్రాప్తి కలిగిస్తుంది.

– ఈ రోజున నువ్వుల నూనెలో లక్ష్మి, నీటిలో గంగాదేవి ఆవహించి వుంటారు. అందకే ఆ రోజున నువ్వులనూనెను పట్టించి తలస్నానం చేస్తే శ్రీమహాలక్ష్మీదేవి శుభాలను ఇస్తుంది.

– రాక్షసరాజు బలిచక్రవర్తిని పాతాళానికి నెట్టిన రోజు.

– ఈ దీపావళి ముందురోజే సత్యభామ నరకాసురుడిని వధించింది. ఈ నరక చతుర్ధశి అన్న యమునికి ప్రీతికరమైన రోజు.

– ఈ దీపావళి రోజున శ్రీమహాలక్ష్మి భూలోకానికి వచ్చి ఇల్లు ఇల్లును చూసుకుంటూ శుభప్రదమైన ఇంటిలో తన కళ ఉంచి వైకుంఠానికి చేరుతుంది.

– రావణాసురుని వధ అనంతరం అయోధ్య చేరిన శ్రీసీతారాముడు పట్టాభిషిక్తుడయిన రోజు కూడా ఇదేనని కొంతమంది పురాణవేత్తలు చెబుతుంటారు.

## ఓడిపోయి గెలిచన గెలుపులోనే ఆనందం, మజా

అప్పుడు తెలుస్తుంది అసలు మజా. డబ్బు మైకంలో ఎవరు ఏమిటో తెలుసుకోలేక అంతా నావారే నని భ్రమిస్తే.. ఆ ధనం పోయిన తర్వాత అసలు విషయం తెలుస్తుంది. కానీ అప్పటికే చేయి దాటిపోతుంది. ఓడిపోయినప్పుడే ఎవరు మన, ఎవరు పర అని తెలుస్తుంది. జీవితపు తాలూకూ అసల సంపదలన్నీ పొందగలిగేది అప్పుడు మాత్రమే. పాండవులు అన్నీ కోల్పోయి అరణ్యవాసం చేస్తున్న సమయంలో కనీసం పలకరించటానికి వచ్చిన వార్నే నమ్మి సైన్యంలో చేర్చుకున్నాడు ధర్మరాజు. అదే సుయోధనుడు రారాజుగా వుంటూ అహంతో, మదంతో తన దగ్గరికొచ్చిన ప్రతివార్నీ నమ్మి సర్వమూ కోల్పోయాడు. తన పక్కనున్నవారే తనకి ద్రోహం చేశారు. ఉదాహరణకు శల్యుడు. అలాంటి శల్యుల విషయంలో బహు పరాక్.

**భర్త బాధ చూసి ఆ ఇంటి ఇల్లాలు కన్నీరు పెడితే దానికి కారణమైన వారి గతి అధోగతే.**



## కుంకుమార్చన చేయిస్తే సర్వ సమస్యలు తీరుతాయి

## అధినాయకత్వాన్ని ఎదరించవద్దు

సర్వసమర్థలెప్పుడూ హుందాగా ప్రవర్తిస్తుంటారు. ఏదో అవకాశం దొరికింది కదాని, అహంకారంతో ప్రవర్తిస్తే సర్వం పోగొట్టుకోక తప్పదు. తనని ఎంతో మర్యాదామన్ననలతో పలకరించిన శ్రీమహావిష్ణువుని లక్ష్మీదేవి ముందే అవమానం చేసినందుకు మహర్షి దుర్వాసుడు తన నేత్రాన్ని పోగొట్టుకున్నాడు. భర్త, యజమాని, పనిచ్చేవాడు, అధికారి, అప్పిచ్చేవాడు ఇలాంటి వారందరూ అధినాయకుని కింద వస్తారు. ఎదరించటం సమస్యలను సృష్టించటం పెద్ద విషయం కాదు. ఆ తర్వాతే వుంటాయి అనగా యాక్షన్‌కి యాక్షన్ ఇస్తే వచ్చేవే అసలు సమస్యలు.... సమస్యను సృష్టించిన వారికి... ఆ సమస్యని ఎదుర్కొన్నవారు యాక్షన్‌ని వందరెట్లు వేగంగా ఇస్తారు. దాన్ని తట్టుకునే శక్తి వుంటేనే సమస్య సృష్టించాలి. అంత శక్తి లేకుండా సమస్య సృష్టిస్తే మొత్తం వినాశనమే.

## శనివారమంటే శ్రీ వేంకటేశ్వరునికి ఎందుకంత ప్రీతి

శనివారం 'ఓం' కారం ప్రభవించిన రోజు.

- శనివారం ఎవరైతే శ్రీవేంకటేశ్వరునికి భక్తి శ్రద్ధలతో పూజ చేస్తారో, వారికి ఎలాంటి కీడు చెయ్యనని శనీశ్వరుడు చెప్పిన రోజు కూడా శనివారమే.

శనివారమే శ్రీవేంకటేశ్వరుడు శ్రీమహాలక్ష్మిని తన వక్షస్థలమును నిలిపిన రోజు.

శనివారం నాడే తొండమానుడికి శ్రీవేంకటేశ్వరుడు ఆలయం నిర్మించమని చెప్పిన రోజు.

సుదర్శనం పుట్టిన రోజు కూడా శనివారమే.

శ్రీనివాసుడు ఆలయాన ప్రవేశించిన రోజు కూడా శనివారమే.

అలాగే శనివారం నాడే శ్రీనివాసుడు పద్మావతీదేవిని వివాహమాడింది. అందుకే ఆ రోజు అనగా శనివారము శ్రీనివాసునికి అత్యంత ప్రీతి.

## రక్తచందనము, మారేడుదళములతో లక్ష్మీనారాయణులను పూజింపకూడదు



## ఎలాంటి వాళ్ళు ఎదురొస్తే శుభం, లాభం

సువాసినీ, వేశ్య, ఇద్దరు విప్రులు... మంగళ వాయిద్యాలూ, పండ్లు, పూలబండ్లు, గుర్రం, చామర, గొడుగు, ఏనుగు, పూర్ణకుంభము, చెరకు, పాలు, అన్నము, పెరుగు, అగ్ని, వధూవరులు, తేనె, శంఖము, ఘంటారావము, జయధ్వజము, చల్లని పిల్ల గాలులు.... ఇత్యాదివన్నీ శుభాలనిస్తాయి. కార్యాన్ని విజయం చేస్తాయి.

## శ్రీలక్ష్మీపతి భోజన ప్రియుడు

వైకుంఠవాసుడు భోజనప్రియుడు. అందుకే తిరుమలలో సహితం రోజుకి ముప్పయికి పైగా నైవేద్యాలను పెడతారు. గృహంలో శ్రీలక్ష్మీనారాయణ పూజ చేసి ముప్పయి నైవేద్యాలు పెడితే మహాసంకల్పం నెరవేరుతుంది. పెళ్ళి, ఉద్యోగం, కొత్తవ్యాపారము ఇత్యాది శుభకార్యాల సమయంలో పూజించి మహా నైవేద్యం పెడితే ఆ కార్యాలకి శుభం, విజయం కలుగుతుంది. (శ్రీవేంకటేశ్వర మహత్యంలో వివరించబడినది.)

## తీవ్రమైన సమస్యలున్నవారు ఎనిమిది శుక్రవారాల పాటు అష్టలక్ష్మి ఆలయంలో ప్రదక్షిణలు చేయటం మంచిది

## ఓటమికి తొలి అడుగు అసూయ

అర్థశాస్త్రం, చాణక్యనీతులు రాసిన చాణక్యుడి నీతిశాస్త్రంలో ఓ చిన్న లైన్ అది. ఇందులో ఎంతో ఆర్థికసంబంధిత అర్థం వుంది. అసూయే ద్వేషంగా మారుతుంది. ఆ ద్వేషమే మనలోని గొప్ప క్వాలిటీస్‌ని చెదపురుగులా తింటుంది. తద్వారా వక్రమార్గం దిశగా ప్రయాణిస్తూ తాత్కాలిక ఆనందాలను పొందుతూ, ఒకేసారి అధఃపాతాళానికి పోవాల్సి వుంటుంది. ఆపై అసూయాద్వేషాల వల్ల ఎన్ని సంపదలు పోగొట్టుకున్నదీ తెలిసే సరికి ఆలస్యమే అవుతుంది. ఆపై ఆకులు పట్టుకున్నా ప్రయోజనం శూన్యం.

## శ్రీవిష్ణుసహస్ర నక్షత్ర పారాయణ ఎంతటి ధన సుఖలాభం

27 నక్షత్రాలలో శ్రీవిష్ణుసహస్రనామ పారాయణ 27 రోజులు పాటు మధ్యలో ఆటంకం లేకుండా చెయ్యటం ద్వారా మహర్ధశ పడుతుంది. అపార సౌఖ్యాలు కలుగుతాయి.



## అందమైన మొగుడికి సంపాదన లేదు.. అందమైన కూతురుకి పెళ్ళి సంబంధం రావటం లేదు

అలాంటి సమస్య వున్నవారు శ్రీలక్ష్మీనారాయణులను కలువపూలతోనూ, కనకాంబరాలతోనూ పూజాదికాలు నిర్వహించాలి. బంగారు రంగు పీటపై లక్ష్మీదేవి ప్రతిమను ఉంచి సకల విధాలా స్తుతించి ప్రార్థిస్తే శుభం జరుగుతుంది.

## సృష్టిలో బంగారు జింక లేదు

అయినా సీతాదేవి ఆశ పడింది. తత్ఫలితం మహా కష్టాలు. వేయి గోవులలో వున్నా లేగదూడ తల్లిని ఎలా గుర్తుపడుతుందో సమస్యలూ, కష్టాలూ అన్నింటికీ మించి కర్మఫలం చేరుతుంది. కాన చాణక్య నీతి ప్రకారం బాధలూ, వ్యధలూ సంతోషంగా అనుభవిస్తేనే, ఫేస్ చేస్తేనే మహా వైభోగాలు అందుతాయి. జరిగిపోయిన దాని గురించి ఆలోచించటం వృధా. జరగాల్సిందాని గూర్చి ఆలోచించటమే విజయలక్ష్యానికి ప్రథమసూత్రం.

## ఏ పంటిలో ఏ విషయముందో...

కొంతమంది తిడితే అక్షరాలా జరిగే తీరుతుంది. వాళ్ళ ఆక్రోషం మాటగా మారి శాపనార్థాలు పెడితే సర్వనాశనం తప్పదు. అందుకే మన పెద్దలు చెబుతారు.. ఎంత నీచుడనైనా తిట్టద్దని. అవతల వాళ్ళు మనకి చెడు చేస్తే తిరిగి వచ్చేది మహా చెడే.. అందుకే మంచి చేస్తే మంచి రాకపోయినా చెడు చేరుతుంది. చెడు అంటే దరిద్రము.

## భగవంతుడు అక్కడ వున్నాడు

ధన అధికార, అహంకార మదాలతో సర్వమూ కోల్పోయినప్పుడు 'తన' అనుకున్నవారే చెయ్యాల్సిన సకల అకార్యాలూ చేస్తుంటే చెయ్యలేక, చేతకాక, తెగించలేక అసహాయంగా మిగిలినప్పుడు కనులలో తిరిగే కన్నీళ్ళు, ఆ కన్నీళ్ళలో దేవుడు కనిపిస్తాడు. అప్పుడు కలిగేదే భక్తి... ఆ భక్తే భగవంతునికి అత్యంత ప్రీతికరమైన మహా భక్తి పుష్పము.

## శ్రీమహావిష్ణువును ఒక మొగలి రేకుతో పూజించినా అది సహస్రదానములతో సమానము



## విజయాన్ని తెచ్చే సూత్రం ఎప్పుడూ ఒక్కటే వుండదు

ధర్మాధర్మాలు పక్కన పెడితే దుర్యోధనుడి ఆలోచన, అదే మాయాజూదం మహా విజయాన్నీ, ఆనందాన్నీ, ధనాన్నీ ఇచ్చింది. అదే సూత్రాన్ని దుర్యోధనుడు రెండోసారి ద్రోణాచార్యుడు యుద్ధ సమయంలో ఏం వరం కావాలో కోరుకోమన్నప్పుడు ధర్మరాజును ప్రాణాలతో పట్టి తెస్తే మళ్ళీ జూదం ఆడించి అడవులకి పంపుతానని అంటాడు. దానితో ద్రోణాచార్యుడు ఇచ్చిన వరం తీర్చటానికి షరతు పెడతాడు. ఎంతో ఆదరంగా ద్రోణుడు కోరుకోమన్న వరం దుర్యోధనుడు పాత సూత్రాన్నే పాటించాలనుకునే కుటిల బుద్ధి వల్ల సర్వమూ పోగొట్టుకుంటాడు. అదే ధర్మరాజును కదన రంగంలో కూల్చుమన్నట్లయితే భారత గాథ ఎలా వుండేదో... కాన ఒకసారి విజయాన్నిచ్చిన సూత్రం రెండోసారి పనిచేయదు.

## శ్రీలక్ష్మీదేవి అంశ అయిన రుక్మిణీదేవి కూడా దుర్గాదేవిని ఆరాధించింది

## పెళ్ళికూతురుని చేసిన తర్వాత గృహంలో గౌరీపూజ ఎందుకు చేయిస్తారు

ఇంటి మహాలక్ష్మి ఆడపిల్ల... పెళ్ళి పేరుతో ఇంటి లక్ష్మిని వేరే ఇంటికి పంపిస్తున్నందుకు ఆడపిల్ల గౌరీదేవిని పూజించి నా పుట్టింటి వారి సకల సౌభాగ్యాలనూ, ఐశ్వర్యాలనూ వారికి వుండనివ్వు అనీ, తనను జీవితాంతం సుమంగళిగా వుంచమని ఆ గౌరీదేవిని పూజించటమే అందులోని పరమార్థం. ఆపై అత్తింటి వెళ్ళాక, ఆమె చేసిన ధర్మపుణ్య కార్యాల వల్ల శ్రీ ధనలక్ష్మి ఆ గృహానికి మరింత శుభాలను ఇస్తుంది.

**మహావీరుడూ, అధిక ధనసంపన్నుడూ, నాయకుడూ, మహా గౌరవాలని పొందిన, పొందగలిగే భర్తను పొందటానికి కాత్యాయనీ దేవిని పూజించాలి.**



## ధనముంది కదాని విర్రవీగవద్దు...

అలా చేస్తే లేనివారిలో ద్వేషం ప్రబలుతుంది. బంగారం మీద ఆశతో, కోరికతో ఎంతటి అపకారమైనా చేయవచ్చు... ధనం మహా భయంకరమైనది. ఏదైనా చేయిస్తుంది. పూర్వము సువర్ణష్ఠీ అను రాజ పుత్రునికి ఉమ్మి, చెమట, కన్నీరు కూడా బంగారంగా స్రవిస్తుండేది. దానితో మహా రాజు పుత్రుడనికూడా సంకోచించక అడవి దొంగలు ఎంతో చాకచక్యంతో ఆ బాలుడ్ని ఎత్తుకెళ్ళి శరీరమంతా తడిమి పొట్టను చీల్చి కూడా చూసి బంగారం ఎలా స్రవిస్తుందో అర్థంగాక విసుగొచ్చి చంపేసి అడవిలో పడేసి వెళ్ళిపోతారు. అంతటి మహారాజే ధన ఆశగల వాళ్ళ నుంచి పుత్రుడ్ని రక్షించుకోలేకపోయాడు.

**పులగం అనగా పొంగలి, అప్పాలు... నువ్వులతో చేసిన వాటిని దేవాతర్చన తర్వాతే తినాలి. అంతేగాని యథేచ్ఛగా వండి తినుట దోషము**

## మహాభోగాలు....

శ్రీలక్ష్మీదేవిని ప్రసన్నం చేసుకుంటే ధనం వస్తుంది. ఆ ధనమే భోగాలకి మూలం. భోగాలు ఎనిమిది విధాలు. గృహం, శయ్య, వస్త్రం, ఆభరణం, స్త్రీ, పుష్పం, గంధం, తాంబూలం.

**మహాభారత యుద్ధంలో ఉత్తములైన వారు 76 కోట్ల 20 వేలమంది, ఇంకా ఇతరులు 24 వేల 320 మంది మరణించారు. అంత మహా నష్టం దేని వల్ల జరిగింది. మొత్తం నేనే... సకల సంపదలూ నావే... ఎవ్వరూ బ్రతకకూడదు. ఎవ్వరు సుఖపడకూడదు.. నేనూ, నా వారే అనుకున్న దుర్యోధనుడి వల్ల.**



## శత్రువులుంటే ధనవంతులవ్వలేరు

ఎప్పుడైతే తాను బలహీనుడనని అవతల వాడు భావిస్తాడో ఆ క్షణమే శత్రుత్వము మనసులో మొలకెత్తుతుంది. శత్రువు చేసే పని ధనాన్నీ, కీర్తినీ, వీలయితే స్త్రీనీ పొందాలనుకుంటాడు. అవి లేకుండా చేద్దామనుకుంటాడు. కాన శత్రుత్వమే ధనం పొందటానికి అడ్డంకి. అలాంటి వారిని ఎలా లొంగదీసుకోవాలో ఓఘవతీ తీరంలో అంపశయ్యపైనున్న భీష్ముడు ధర్మరాజుకి ఇలా చెబుతాడు.

'బలబలాలు భేరీజు వేసుకోవాలి. తనకంటే శత్రువు బలవంతుడనుకుంటే సంధి చేసుకోవాలి. ఆ ప్రయత్నంలో ధనం పోయినా పర్వాలేదు. అది కుదరకపోతే అదను చూసి సంధి ప్రయత్నం చేస్తూ జయించాలి. కోపంగా మాట్లాడకూడదు.. పుల్లవిరుపు మాటలతో శత్రువుల బలాన్ని పెంచకూడదు. అస్సలు రెచ్చకొట్టకూడదు. ఓర్పుతో వుండాలి. అయితే శ్రుతి మించిన ఓర్పు ఒక్కోసారి అసలుకే మోసం తెస్తుంది.'

## ఉపవాసం ఉంటే ధనప్రాప్తి

పాడ్యమీ, పంచమీ, నవమీ, ఏకాదశీ, త్రయోదశీ, పౌర్ణమిలలో ఉపవాసములు మహా ధనప్రాప్తినీ, లక్ష్మీదేవి అనుగ్రహాన్నిస్తాయి.

## వేటిద్వారా ధనాన్ని సంపాదిస్తే ఆ ధనం వారికి సుఖాన్నివ్వదు....

ఉప్పు... నీరు... నువ్వులు... మాంసం, గోవు, ఎద్దు, అన్నం, కల్లు, నేయి, నూనె, తేనీరు ఇట్టి వాటిని అధిక ధరలతో అమ్మి ధనం సంపాదిస్తే ఆ ధనం వారికీ, వారి వారికీ సుఖాలనివ్వదని శాస్త్రం. ఈ వ్యాపారంలో వున్నవారు మితిమీరిన ధనమోసాలు చెయ్యరాదనీ, అలా చేస్తే అలా సంపాదించిన ధనం దుఃఖాన్నే ఇస్తుందని భావం.

## శ్రీమహాలక్ష్మీ కటాక్షానికి అడ్డు వచ్చే దోషాలు...

తడికాళ్ళతో నిద్రించటము... ఉదయించే సూర్యుడ్ని చూడటము, తన భార్యనయినా వివస్త్రగా చూడటము... ఉదయపు కార్యాలను తనవి తాను చేసుకోకపోవటము.. సంభోగ విషయాలను చెప్పటము ఇంకా తన దగ్గరున్న ధన బంగారాల గూర్చి చెప్పటము. ఇలాంటివి చెయ్యటం వల్ల ధనం తరిగిపోతుంది. అలాగే ఆయుష్షు కూడా.....



## దర్పము ధన వినాశనానికి మూలం...

ధనం దర్పాన్ని ఇస్తుంది. ఆ దర్పమే ధనాన్ని పోగొడుతుంది. నదీ గట్టు మీద మహా వృక్షాలు మహా ఠీవిగా నిలిచి వుంటాయి. నదీ ప్రవాహ ఉరవడి రాగానే కొట్టుకుపోతాయి. అదే ప్రబ్బలి చెట్టు... ఎంత నీటి వేగం వచ్చినా, వంగుతాయి. ఆపై మళ్ళీ ఠీవిగా నిలబడతాయి. కాన దర్పం పనికిరాదు. దర్పమే సర్వ వినాశనం.

## పరస్త్రీనీ, పరధనాన్నీ పొందితే...

పరాయివాడి సొత్తునీ, స్త్రీనీ దొంగతనంగా పొందితే ఊసరవెల్లిగానూ, సర్పముగానూ జన్మించాల్సి వస్తుంది. విషానికైనా విరుగుడుంది గాని, ఆ దోషానికి విరుగుడు లేదు. శ్రీభాగవత గాథలో నృగ మహారాజు అలా ధనాన్ని పొందినందుకు బ్రతికుండగానే మహా నరకాన్ని పొందాడు. ఆ దోషము మూడు తరాల వరకూ వుంటుంది. వారి వారి వంశస్థులు 60,000 సంవత్సరాలు అశుద్ధంలో బ్రతకాల్సి వుంటుంది.

## బలవంతుల గూర్చి తక్కువగా మాట్లాడద్దు...

అహంతోనూ, కోపంతోనూ, పదిమంది చుట్టూ ఉన్నారని రెచ్చిపోయి బలవంతుల గూర్చి తేలికగా మాట్లాడకూడదు. ఆ మాటలే సర్వనాశనం చేస్తాయి. పూర్వము ఇలాగే బూరుగు చెట్టు మిడిసిపడి గాలి దేవుడిని గూర్చి తేలికగా మాట్లాడింది. వాయుదేవుడు తన వైపుకు వస్తున్నాడని నారదుడి ద్వారా తెలుసుకుని బూరుగు చెట్టు, తనని వాయుదేవుడు ఏం చెయ్యగలడో అర్థం చేసుకుని భయపడి తన ఆకులనూ, కొమ్మలనూ, రెమ్మలనూ, గుబుర్లనూ తనకి తానే విరుచుకుంది. తీరా గాలిదేవుడొచ్చి చెట్టు స్థితి చూసి 'నేనేం చేస్తానో, అది నువ్వే చేసుకున్నావు' అని నవ్వి వెళ్ళిపోయాడు. కాన బలవంతుని గూర్చి వ్యర్థ మాటల వల్ల తన వేలితో తన కళ్ళనే పొడిచుకునే పరిస్థితి వస్తుంది. కాన వద్దు....

**గృహంలో ఏవైనా నిండుకోవచ్చు గాని ఉప్పు నిండుకోరాదు. ఉప్పు నిండుకుందంటే జ్యేష్ఠాదేవి వచ్చినట్టే.**



## ధనం గొప్పదా, లేమి గొప్పదా....?

ఈ రెంటిలో ఏది సుఖాలనిస్తుంది అన్న ప్రశ్న... ధనమే గొప్పదని అంతా భావిస్తుంటారు. మానవుడు సుఖం కోసమే ధనాన్ని సంపాదిస్తాడు. అయితే ధనం పెరిగే కొద్దీ భయభ్రాంతులూ, శత్రువులూ పెరిగిపోతుంటారు. సుఖశాంతులనిచ్చిన ఆ డబ్బు దుఃఖానికి కారణమవుతుంది. అధిక ధనం, అత్యాశ, క్రోధం, పగలను పెంచుతాయి. తద్వారా రోగాలూ, రొప్పులూ... ధనాన్నీ, లేమినీ త్రాచులో పెట్టి తూస్తే ముల్లు లేమి వైపే మొగ్గింది. కాన ధనాన్ని సంపాదించండి. తగు సమస్త సుఖధర్మకార్యాలకూ ఖర్చు చెయ్యండి. మళ్ళీ సంపాదించండి. అప్పుడే ధనం ద్వారా వచ్చే సుఖాలను పొందగలరు. అలాగే వృద్ధాప్యానికి అవసరమైన నిధిని వుంచుకోవాలి.

**అదృష్టం ప్రతివారి తలుపు కొడుతుంది. ఆ అదృష్టానికి అసలు సిసలు పేరే అవకాశం. ఆ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోవటమే అదృష్టాన్ని అందుకోవటం.**

## మద్యం... స్త్రీ... జూదం..

అస్సలు అలవాటులేకపోయినా అవతల వారు మీకు అలవాటు చేసేది మీ ధనం ఆశించే. ముందు వాళ్ళ డబ్బులు ఖర్చు పెడతారు. గౌరవిస్తారు. ఆపై మీకే అప్పులిప్పిస్తారు. పూర్తిగా ముంచేస్తారు. ఆపై మీ ధనాన్ని తేలికగా వశపర్చుకుంటారు. అంతా తెలిసే సరికి సర్వమూ కోల్పోతారు. అవతల వారు ఇప్పిస్తున్నారని తాగితే లేదా ముందుకు సాగితే.. వాళ్ళు పది రూపాయలు ఖర్చుపెట్టేది, మీ నుంచి లక్ష కొట్టెయ్యటానికే అని తెలుసుకోండి. అలా పోయిన దాని గూర్చి పురాణ ఇతిహాసాల్లోని ఉదాహరణ చెప్పక్కర్లేదు. మన పక్కనే వుంటారు. ఆలోచించండి. మీకే తెలుస్తుంది. ధనాన్ని దౌర్జన్యంగా తీసుకోవటం నీచమైనదీ, అంతకంటే నీచాతి నీచమైనది వ్యసనాలను అలవాటు చేసి పబ్బం గడపుకోవటమే.

## వీరిని ఇలా పూజింపకూడదు

రుద్రాధరుడిని పూష్పమాలతో, గణేషుడిని తులసిచేత, దుర్గాదేవిని గరిక ద్వారా, సూర్యుణ్ని బిల్వపత్రాల ద్వారా, విష్ణువుని అక్షతల ద్వారా పూజింపకూడదు.



## మిత్రత్వంలో శత్రుత్వం .... మహా నష్టము

అన్నదమ్ముల మధ్యగానీ, స్నేహితుల మధ్యగానీ గొడవ ప్రారంభమయితే అది మహా తీవ్రమైన శత్రుత్వానికి దారి తీస్తుంది. ఆ శత్రుత్వము ఇరువైపుల వారిని అనేక కష్టాలకీ, బాధలకీ ఆర్థికనష్టాలకీ గురి చేస్తుంది. పురాణ ఇతిహాస చరిత్ర గాథలు తీసుకుంటే అన్నదమ్ముల మధ్య వైరం మహా కురుక్షేత్రానికి దారి తీసింది. స్నేహితులైన ద్రోణాచార్యుడు, ద్రుపదుల మధ్య మహా విధ్వంసాన్ని సృష్టించింది. స్త్రీ మూలంగానే కాదు సకల వైభోగాలూ, మహా యుద్ధాలూ జరిగేది.

అన్నదమ్ముల మధ్య, స్నేహితుల మధ్య వైరం కూడా అంతటి మహా తీవ్రమైన నష్టాలనూ తెస్తుంది. కలిసి వుంటేనే మహా సంపదలైనా, విజయమైనా. అర్జునుడు కురుక్షేత్ర రంగంలో అక్షౌహిణుల సైన్యాన్ని సంహరించాడు. అదే మహా భారత చివర శ్రీకృష్ణుడు నిర్యాణం చెందాక, అర్జునుడు ద్వారక నుంచి తన నగరానికి శ్రీకృష్ణుని భార్యలనీ, ప్రజలనీ తీసుకొస్తుండగా దొంగలు విరుచుకుపడ్డారు. ఎన్ని బాణాలు వేసినా పార్థుడ్ని లెక్క కూడా చెయ్యలేదు. అంతటి అర్జునుడూ

శ్రీకృష్ణుడు లేకపోయేసరికి గజ దొంగలకు మామూలుగా కానవచ్చాడు. అర్జునుడు చూస్తుండగానే ధనాన్నీ, శ్రీకృష్ణుని భార్యలనూ(అష్టభార్యలని కాదు) దొంగలు తీసుకెళ్ళిపోయారు.

## బట్టలు పెట్టడం ఎంతటి ధన ఫలం...

వివాహాది శుభ కార్యాలలో అయిన వారికి బట్టలు పెట్టడం మన సంప్రదాయం. అయితే వారితో పాటు సేవకులకి కూడా బట్టలు పెడితే శ్రీలక్ష్మీనారాయణుల అభయం కలుగుతుంది. శ్రీకృష్ణ బలరాములు మధురానగరిలో కంసవధకై వచ్చినప్పుడు తనకి ఎదురైన వ్యాపారిని అడుగుతాడు కృష్ణుడు 'నాకు మంచి దుస్తులు ఇస్తావా?' అని. అయితే రజకుడు కంసుని సేవకుడు. కాదన్నాడు, ఇవ్వనన్నాడు. మహా సంపదలను పోగొట్టుకున్నాడు. అక్కడ శ్రీకృష్ణుడు అడగటానికి కారణం ఎంత పుణ్య ఫలం వున్నా అదృష్టదేవత వరించినా దుష్టసాంగత్యము వల్ల సమస్తమూ పోతుందని. కాన దుష్టసాంగత్యము చేస్తే శ్రీలక్ష్మీదేవి కరుణించదు. అలాంటి వారితో తెలిసీ తెలియక చేసిన తప్పులూ, దోషాలూ పోవటానికే బట్టలు పెట్టేది.



**శత్రుత్వము రావటానికి ప్రధాన కారణాలు... అధికారము, భూమి, సంపద, స్త్రీలు, గౌరవమూ, ప్రాభవము... అవే కారణాలు. దేనికోసం అయినా శత్రుత్వం ప్రారంభమయితే మొదట పోయేది ఇరువురికీ ధనమే**

## లక్ష్మణకు ఇచ్చిన అరణము

దుర్యోధన సార్వభౌముడి పుత్రిక లక్ష్మణకీ, జాంబవతీ పుత్రుడైన సాంబుడికీ వివాహం వైభవోపేతంగా జరిగింది. ఆ వివాహ సందర్భంగా దుర్యోధనుడు అరణముగా 60 యేళ్ళ వయస్సు గల 12,00 ఏనుగులనూ, 10,000 ఉత్తమజాతి అశ్వాలనూ, 6,000 రథాలనూ, 1000 మంది సువర్ణ భూషణాభూపేతులైన దాసీలనూ అల్లుడికి కానుకగా ఇచ్చాడు.

## వివాహ శుభకార్యాల్లో జూదం మహాతీవ్ర నష్టము

అందరూ ఆనందంగా సంతోషంగా కలిసే శుభకార్యాల్లో జూదం ఆడటమంటే కోరి కోరి సమస్యలని తెచ్చుకున్నట్టే. ఒక్కోసారి మహా తీవ్ర ధననష్టాలనీ, ప్రాణ నష్టాలని కూడా తెస్తుంది. రుక్మిణీ పుత్రుడు ప్రద్యుమ్నుడూ, రుక్మావతి వివాహ సమయంలో బలరాముడూ, రుక్మిణీ సోదరుల మధ్య జూదం జరిగింది. మొదట వంద బంగారు నాణాలతో ప్రారంభమయిన జూదం, లక్ష బంగారు నాణాల దాకా పోయింది. కోప ఆవేశాలూ, పాత పగలూ భగ్గున లేచాయి. పున్నమి రోజు సముద్రం పొంగినట్టు పొంగారు. వారిద్దరూ కొట్టుకుంటుంటే శ్రీకృష్ణుడు మౌనవ్రతం దాల్చాడు. తన సోదరుడికి వ్యతిరేకంగా మాట్లాడితే రుక్మిణికి కోపం వస్తుందని. రుక్మిణీ దేవి కూడా తన సోదరుడికి వత్తాసు పలికితే భర్తకి, బలరాములవారికీ కోపం వస్తుందని. కాన జూదం వద్దు.



## గుప్పెడు అటుకులు చాలు స్వామి నివేదనకి

సుదాముడు అనగా శ్రీకృష్ణుడి చిన్ననాటి స్నేహితుడు. కుచేలుడు అనబడే ఆతడు తన దరిద్రాన్ని పోగొట్టుకోవడానికి శ్రీకృష్ణమహాత్ముడ్ని కలవడానికి వెళ్తుండగా ఆతడి భార్య భక్తితో కృష్ణయ్యకి ఇమ్మని అటుకులిచ్చి పంపింది. తన మిత్రుడికి సకల మర్యాదలు చేసిన తర్వాత కుచేలుడు తెచ్చిన అటుకులని ప్రేమగా ఓ గుప్పెడు తీసుకొని నమలసాగాడు. ఆపై మరో గుప్పెడు తీసుకోబేతే శ్రీమహాలక్ష్మీదేవి అంశ అయిన రుక్మిణీదేవి వారిస్తుంది. చాలు స్వామీ మీరు తిన్న ఆ గుప్పెడుకే ఈ జన్మ, మరుజన్మలో కూడా సంపన్నుడవుతాడని ఆపుతుంది. కాన లక్ష్మీదేవికి భర్త చెప్పినా, తాను ఇష్టపడ్డా...నివాసము తాత్కలికమే.

## బొట్టు పెట్టుకొనేటపుడు చదువుకునే శ్లోకం

కాశ్మీరం ధధ్యామ్య రుణం శోభాయమాన మాననే।
విష్ణుప్రియే సదాదేవి దేహి సౌభాగ్య తాంచమే ॥

## వీరివద్ద ధనం నిలవకపోవటానికి కారణము

సరస్వతీ నదీతీరమున సత్రయాగం జరిగింది. అందు పాల్గొన్న భృగుమహర్షితో అక్కడి మునుల చర్చల్లో త్రిమూర్తులలో ఎవరధికులు అన్న ప్రశ్న వస్తుంది. దానితో భృగుమహర్షి తను నిర్ణయిస్తానని చెప్పి తొలుత బ్రహ్మలోకం వెళ్ళాడు. అక్కడ భృగుమహర్షి చేసిన అపచారానికి బ్రహ్మదేవుడు కోపించి శపించబోయి ఆగాడు. కారణం భృగుమహర్షి తన పుత్రుడవ్వటం వల్ల. ఆ తర్వాత కైలాసము వెళ్ళాడు. తనని ఆదరించబోయిన శివుడ్ని బూడిదరాసుకునే వాడివి నీవు అని మాట్లాడాడు. మహాశివుని కోపాన్ని పార్వతీదేవి ఉపశమింప చేసింది. ఆపై విష్ణులోకం వెళ్ళాడు. అక్కడ శ్రీమహావిష్ణువు యెడల కోపంతో మహాపచారం చేశాడు. శ్రీమహావిష్ణువు పాదాలు వత్తుతున్న లక్ష్మీదేవికి కోపం వచ్చింది. ఘోరాతిఘోరమైన ఆ తప్పిదానికి భూలోకంలో మీవాళ్ళెవ్వరికీ నా ఆదరము సంపూర్ణంగా లభించనీయనని నిర్ణయించుకుంది.



## ధనమూ, కష్టాలూ, సమస్యలూ వంతెన క్రింద ప్రవహించే నీళ్ళవంటివి. వస్తూ వుంటాయి. పోతూ వుంటాయి. వాటి గూర్చి ఎక్కువ మదన పడకపోవటమే విజ్ఞుల లక్షణము

## ధనం కన్నా యవ్వనము గొప్పది...

జరాభారంతో కృంగిన యయాతి తన పుత్రులని పిలిచి, నా సమస్త సంపదలూ ఇస్తాను ఈ ముసలి తనాన్ని తీసుకొని, మీ వయసుని ఇవ్వమని అడుగుతాడు. అనారోగ్యముంటే తినలేం, సుందర దృశ్యాలను చూడలేము. సొగసుగత్తెల సౌఖ్యాన్ని అనుభవించలేం. కాన మీ సంపదలకన్నా మా వయసూ, ఆరోగ్యమే ముఖ్యమని పుత్రులు చెబుతారు. కాన ధనం కన్నా ఆరోగ్యం గొప్పది. ఆ ధనం కోసం తాపత్రయ పడి ధనంకన్నా తక్కువైన అనారోగ్యాన్ని తెచ్చుకోవద్దు.

## సర్వవిఘ్నాలు తొలగుటకు సంపదలు వృద్ధి అగుటకు శ్రీ లక్ష్మీ గణపతి ధ్యానము

బిభ్రాణః శుకబీజపూరకమిలన్మాణిక్యకుంభాంకుశాన్
పాశం కల్పలతాం చ ఖడ్గవిలసజ్జ్యోతిస్సుధానిర్ఝరః ।
శ్యామే నాత్తసరోరుహేణ సహితం దేవీద్వయం చాంతికే
గౌరాంగో వరదానహస్తసహితో లక్ష్మీగణేశోఽవతాత్ ॥

## గృహ ఆహ్వానం కొరకు శ్రీమహాలక్ష్మీ ధ్యానము
(చండీకల్పము ప్రకారం)

అక్షస్రక్పరశుం గదేషుకులిశం
పద్మం ధనుః కండికాం
దండం శక్తి మసిం చ చర్మ జలజం
ఘంటాం సురాభాజనమ్ ।
శూలం పాశ సుదర్శనే చ దధతీం
హస్తైః ప్రవాళప్రభాం
సేవే సైరిభమర్దినీ మిహ మహా
లక్ష్మీం సరోజస్థితామ్ ॥



## శ్రీ విష్ణుపరివార శక్తుల యొక్క ధ్యానము శుభకార్యాల కోసం... దంపతుల మధ్య మనస్పర్థలు పోవటానికి (పద్మపురాణం ప్రకారం)

సువర్ణనిభశోభా శ్రీః స్యాత్ సా భూ రర్జునచ్ఛవిః
సరస్వతీ సితా రక్తా ప్రీతిః శ్యామనిభాకృతిః ॥
కీర్తీ రక్తా భవే చ్ఛాంతిః స్ఫాటికాభా సమీరితా
తుష్టిః పీతా భవేత్ పుష్టిః శ్యామా దేవ్య స్తు తాః స్మృతాః॥
పద్మద్వయకరా శ్చైవ వరాభయకరా స్తు తాః ॥

## శ్రీ ప్రసన్నలక్ష్మీ ధ్యానము ఆకస్మిక ధనప్రాప్తి కొరకు, పోయిన ధనం తిరిగివచ్చుటకు (అథర్వణ రహస్యం నుంచి)

వందే లక్ష్మీం పరశివమయీం శుద్ధజాంబూనదాభాం
తేజోరూపాం కనకవసనాం సర్వభూషోజ్జ్వలాంగీమ్ ।
బీజాపూరం కనకకలశం హేమపద్మే దధానా
మాద్యాం శక్తిం సకలజననీం విష్ణువామాంకసంస్థామ్ ॥

## శ్రీ సౌభాగ్యవాగీశ్వరీ ధ్యానము భర్త పిల్లల సుఖ సంతోషాల కోసం

(శారదా తిలకం నుంచి)

తరుణశకల మిందో ర్బిభ్రతీ శుభ్రకాంతిః
కుచభరనమితాంగీ సన్నిషణ్ణా సితాబ్జే ।
నిజకరకమలోద్యల్లేఖినీ పుస్తకశ్రీః
సకలవిభవసంపైః పాతు వాగ్దేవతా నః ॥

## శ్రీ పద్మానామకలక్ష్మీ ధ్యానము ధనవస్తు వాహనాలకై

పద్మా పద్మాసనాసీనా పద్మాభా పద్మవాసినీ
హేమరత్నోజ్జ్వలన్నక్రకుండలం కర్ణమండనమ్ ॥
చంద్రబింబామలముఖీ కర్ణపూరాయతేక్షణా
సయౌవనా సురమ్యాంగీ కుంచితభ్రూసువిభ్రమా ॥
రక్తోష్ఠీ పీనగండా చ కంచుకాచ్ఛాదితస్తనీ
శిరసో మండనం శంఖచక్రసీమంతపద్మకమ్ ॥
నాగహస్తసమౌ బాహూ కేయూరకటకోజ్జ్వలౌ
పంకజం శ్రీఫలం వామే దక్షిణే బిభ్రతీపరా ॥
శోభనాంబరసంపన్నా విపులశ్రోణికా తథా
మేఖలాకటిసూత్రాంకా లక్ష్మీ ర్లక్ష్మీవివర్ధనీ ॥



## శ్రీ ద్రౌపదీ దేవీ ధ్యానము

ఏకవక్త్రాం త్రిణేత్రాం చ కిరీటమకుటాన్వితామ్
కృష్ణవర్ణసమాయుక్తాం ద్విభుజాం చిత్రవస్త్రకామ్ ॥
పంకజం దక్షిణే హస్తే వామే లంబకరాన్వితామ్
సర్వాభరణసంయుక్తాం దధానాం నవయౌవనమ్ ॥
త్రిభంగీ మగ్రగణ్యాం తాం ద్రౌపదీం సుందరీం భజే ॥

## డబ్బున్నోళ్ళని భయపడద్దు

దబ్బుతో ఏం చేసినా చెల్లుబాటు అవుతుందనుకునే అహంకారులను చూసి వారి అధర్మాలను భరించవద్దు. మౌనంగా గమనించండి. ఆ ధన మదంతో ధర్మం తప్పుతారు. ఆ ఒక్క అవకాశం చాలు ఏడంతస్థుల నుంచి జారి నేలమీద పడటానికి. అలాంటి వాళ్ళు ద్వేషంతో చెయ్యాల్సిందంతా చేస్తారు. కోపానికీ, ద్వేషానికీ తేడా వుంది. దాన్ని తెలుసుకోండి. కోపముంటే వదిలేయండి. లోపల కుళ్ళు వుంటే మాత్రం వాళ్ళతో జాగ్రత్తగా వుండండి. శిశుపాలుడు అలా ద్వేషంతోనే వంద తప్పులు పూర్తి చేశాడు. శ్రీకృష్ణుడి సుదర్శన చక్రంతో హతమయ్యాడు.

## విజయదశమి రోజు శమీ వృక్షానికి పూజ చేస్తే

సంవత్సర కాలంలో చేసిన సకల దోషాలు సమసిపోతాయి. శమీ వృక్షం అనగా జమ్మి చెట్టు. ఈ రోజున శమీ వృక్షమునకు గానీ, కొమ్మకి గానీ, ఆకులకు గానీ నమస్కరించినంతనే, పూజించినంతనే మహా విజయం కలుగుతుంది. ఈ రోజున సూర్యాస్తమయానికి ముందు శమీ వృక్షాన్ని పూజించి కోరిన కోర్కెను రాసి ఆ వృక్షానికి సమర్పిస్తే కోరుకున్న కోరిక తీరుతుంది. శమీ పూజా కాలం సూర్యాస్తమయానికి గంటా ముప్ఫయి ఆరు నిమిషాల ముందు నుంచి విజయకాలం మొదలవుతుంది. ఆ విజయ సమయం నలభై ఎనిమిది నిమిషాలు వుంటుంది. ఈ సమయంలో పూజించటం అత్యంత శ్రేష్ఠము.

## శ్రీ లక్ష్మీ ధ్యానము మహావైభోగాలూ, సుఖసంతోషాల కోసం

అరుణకమలసంస్థా తద్రజఃపుంజవర్ణా
కరకమలధృతేష్టాభీతియుగ్మాంబుజా చ
మణిమకుటవిచిత్రాలంకృతా కల్పజాతై
ర్భవతు భువనమాతా సంతతం శ్రీః శ్రియై నః ॥



## శ్రీ భూదేవీ ధ్యానము గృహశాంతి కోసం.. తెలిసీ తెలియక చేసిన దోషాలు పోవటానికి

స్వర్ణవర్ణా ద్విహస్తా చ దక్షిణే నాభయప్రదా
దాడిమీఫలసంయుక్తా వామే కల్పతరో రథః ॥
వామపాదేన సంస్పృష్టనిధికుంభా ధరా మతా
సర్వాలంకారభూషాఢ్యా ధ్యేయా సర్వఫలప్రదా ॥

## శ్రీ దేవీ ధ్యానము శ్రీలక్ష్మీనారాయణుల ప్రీతికొరకు, సుఖసంతోషాల కొరకు

పాశాక్షమాలికాంభోజసృణిభి ర్యామ్యసౌమ్యయోః ।
పద్మాసనస్థాం కుర్వీత శ్రియం త్రైలోక్యమాతరమ్ ॥

## వీరిని ఇలా పూజింపకూడదు

రుద్రాధరుణ్ని పుష్పమాలతో, గణేషుణ్ని తులసిచేత, దుర్గాదేవిని గరిక ద్వారా, సూర్యుణ్ని బిల్వపత్రాల ద్వారా, విష్ణువుని అక్షితలు ద్వారా పూజింపకూడదు.

## జీరోగా మిగిలారా....

జరిగిందేదో జరిగింది. జరగబోయేది మంచిదే అనుకోండి. ఆర్థికంగా జీరోస్థాయి కొస్తే మొత్తం తప్పంతా మీ అమాయకత్వమే కావచ్చు. అహంకారం కావచ్చు.. లేదా జాలీ, దయల వల్ల కావచ్చు. వదిలేయండి. చుట్టూ వున్న అందరితో గొడవ పడకుండా దూరంగా వుంచండి. ప్రపంచమంటే మీరూ, మీ చుట్టూ ఉన్న వాళ్ళే కాదు. విశాల ప్రపంచం వుంది. కొత్త మనుష్యులు... కొత్త ప్రదేశాలను ఎంచుకోండి. మళ్ళీ మీ పూర్వ వైభవం మీకు తిరిగి వస్తుంది. తిరిగి మీరంటే ఏమిటో మీ ప్రపంచానికి చూపించండి. దానికి ముఖ్యంగా కావల్సింది సహనం... లౌక్యము.

విజయం పదిమంది చేత పొగిడేలా చేస్తుంది. అదే అపజయం అదే పదిమంది చేత చెంప ఛెళ్ళుమనేలా చేస్తుంది. విజయం, అపజయం... అనగా ధనం.. ధనం లేక పోవటము.

## శ్రీ నారాయణ ధ్యానము

నారాయణో ఘనశ్యామః పద్మశంఖగదారిభృత్
పీతవాసా మణిమయై ర్భూషణై రుత్తమై ర్వృతః ॥



## ధనం, సమస్యల విషయాల్లో మీకెవ్వరూ తోడండరు

బాగున్నప్పుడు అంతా అందరూ మాటలు చెప్పేవాళ్ళే... తేడా వస్తే ధనం పోతే... మీకన్నా బలవంతులతో గొడవలొస్తే అంతా అటుకేసి వెళ్తారు. లేదా తటస్థంగా వుంటారు. దానికి కారణం.. ఎవరి ఎక్కౌంట్స్ వాళ్ళకుంటాయి. ఆ రోజు ఎలా మాట్లాడాడు... అనుభవించనీ.. కావాల్సిందే వాడికి... నే చెబితే వినలేదు. ఒక్కటి కాదు... అన్ని రకాలుగా బైటపడుతుంటారు. శ్రీకృష్ణదంతటి వాడు యుద్ధరంగంలో కర్ణుడు కూలిపోతే నీవు చెడు స్నేహం చెయ్యలేదా.. దుర్యోధనుడు అన్ని పాపాలు చేస్తుంటే నీవు చూస్తూ ఊరుకోలేదా.. అర్జునా వేసెయ్ బాణం అంటాడు...

## నిద్ర లేస్తూనే చదువుకునే శ్లోకం

కరాగ్రేవసతే లక్ష్మీః కరమధ్యే సరస్వతీ ।
కరమూలేతు గోవిందః ప్రభాతే కరదర్శనమ్ ॥

## ఎవ్వరూ ఊరికే మీ పనుల్లో తమకి తామే వచ్చి నిలబడరు

ఎవరి ఎజెండా వారికుంటుంది. పని మీది.. మీకన్నా ఎక్కువ శ్రద్ధ అవతల వాళ్ళు పడుతున్నారంటే... ఆ పనిలో వారి లాభం వారికుంటుంది. పదిరూపాయలు తిని మీకు మంచి జరిగేలా చూస్తే పరవాలేదు. అలా కాకుండా అవతల వారితో కుమ్మక్కయి నాశిరకం మీకు అంటగట్టే వాళ్ళతోనే ప్రమాదం. అంతా అయ్యాక గానీ మీకు తెలీదు. ఏంటి అలా కూడా ధనం సంపాదిస్తారా? అని.

## ఏ రోజు తలంటిస్నానం (నువ్వుల నూనెతో)

ఆదివారము చేస్తే తాపము... శనివారం చేస్తే భోగము, శుక్రవారం చేస్తే విపత్తు, గురువారం చేస్తే ధననాశనము... మంగళవారం చేస్తే మహా దుఃఖవిషయాలు. సోమవారం చేస్తే ఉన్నతి. ఇక బుధవారం చేస్తే లక్ష్మీదేవి అనుగ్రహం కలుగుతుంది. (ముఖ్యమైన పండుగ రోజులకి ఇవి లెక్క రావు).



## పెట్టేవార్ని చూస్తే మొత్తబుద్ధేస్తుంది

నేను నిక్కచ్చి అనే పేరు కోసం ఖచ్చితంగా ధనాన్ని చెల్లిస్తుంటే, అదే మీకు సమస్యలని సృష్టిస్తుంది. అలా అని ఇవ్వద్దని కాదు. ఒక పూట అటో, ఇటో.. అలా ఇవ్వాలి. లేదంటే ఇవ్వాల్సిన ధనం కంటే మీ వద్దనుంచి ఎక్కువ ఆశిస్తారు. పని అవ్వకపోతే.. మనసులో పెట్టుకుంటారు. లేదా మీరు కనపడటం ఆలస్యం సమస్యలని ఏకరువు పెడతారు. తద్వారా మీకు మనఃశ్శాంతి వుండదు. కొన్ని సందర్భాల్లో నా దగ్గర ఆలస్యం అవుతుంది. ఆయన దగ్గరికెళ్ళు... నాలుగు మాటలు చెప్పు... పనికానీయ్ అని సలహా చెప్పేవాళ్ళు పుట్టుకొస్తారు. మీ దగ్గరికి పంపిస్తారు. వాళ్ళ పబ్బం కూడా గడుపుకుంటారు. పెట్టని అమ్మ ఎట్లానూ పెట్టదు. పెట్టే అమ్మకేం వచ్చింది మాయరోగం అన్న చందాన పేరు తెచ్చుకోవద్దు.

## మంచం దిగే ముందు చదువుకొనే భూ ప్రార్థన

సముద్రవసనే దేవి పర్వత స్తనమండలే ।

విష్ణుపత్నీ నమస్తుభ్యం పాదస్పర్శం క్షమస్వమే ॥

## కొత్త బట్టలు ఏ రోజున ధరిస్తే ధనప్రాప్తి

భరణీ నక్షత్రాలలో ధరిస్తే ధననాశనము. పుష్యములలో ధరిస్తే భోగభాగ్యాలు. ఉత్తరాషాఢాలలో ధరిస్తే మహా ధననష్టము. అలాగే ఉత్తర, చిత్తలలో ధన సిద్ధి ఇంకా పూర్వాషాఢంలో ధరిస్తే ధనహీనతలు. శతభిషం... ఉత్తరాభాద్రా, రేవతి, ధనిష్ఠలలో మంగళకరము, శుభకరము.

## అశ్వత్థ వృక్షాన్ని ఏరోజు పూజిస్తే ధనప్రాప్తి

శని, సోమవారాల్లో సకల దేవతలు అశ్వత్థ వృక్షాన్ని ఆవహించి ఉంటారు. ఆరోగ్యం కోసం ఆదివారం, మహా విజయం కోసం సోమవారం, వ్యాపారాభివృద్ధికి మంగళవారం, విద్యకై బుధవారం, మహా ధనరాసులకై గురువారం, శుక్రవారం సకల దుఃఖాలు పోవుటకు... శనివారం ధనం కొరకు పూజించాలి. రావిచెట్టును తాకకుండా పూజ చేయాలి.



**శ్రీలక్ష్మీ నారయణులకూ, దేవతలకూ అర్పించే పూలకు తొడిమలు, తీగలు తీసి అర్పించాలి. అలాగే పూలను నీటితో కడుగరాదు. అలాగే అక్షతలు కూడా ఎప్పటికప్పుడు చేసుకోవాలి. పూజాసమయంలో దీపం వెలిగించేటప్పుడు గంట మ్రోగించాలి. అలా చెయ్యటం వల్ల రాక్షసులు వెడలి దేవతలు గృహంలోకి వస్తారు. ఇంకా దీపం వెలిగిస్తూ గోత్ర నామాలు చెప్పకోవాలి.**

## ఏడు గోవులకి ప్రదక్షిణం చెయ్యటం ద్వారా ఎలాంటి ధనప్రాప్తి

గోవు పృష్టభాగంలో లక్ష్మీదేవి నివాసముంటుంది. అట్టి గోమాతకు ప్రదక్షిణ చెయ్యటమంటే భూప్రదక్షిణ చేసినట్టే. ఇక ఏడు అనగా సప్తగోప్రదక్షిణ మరింత ఐశ్వర్య ప్రదం. అలా చేసే బ్రహస్పతి దేవతలకి గురవయ్యాడు. ఇంద్రుడు సకలైశ్వర్యాలూ, సుఖాలనూ, అధికారాన్నీ పొందాడు. గోవు సాక్షాత్తు విష్ణుస్వరూపమే.

**భవిష్య పురాణ ప్రకారం ఏ పూలు....**

పుష్పాలుగాని, ఫలము గాని బోరగిలపడేలా దేవుని ముందు ఉంచరాదు. దోసిలితో పోసేటప్పుడు దోషంలేదు.

- దేవతలకి తెల్లని పూలు ప్రీతికరము.
- పెంచిన చెట్ల పూల ద్వారా పూజించటం మహోన్నతమైన ఫలం.
- ఇతరుల పెరటిలోని పూలతో మీ గృహంలోని దేవతలని పూజింపకూడదు.
- సద్గుణవంతులకిచ్చిన దాన ఫలము శ్రీమహావిష్ణువును పూలతో పూజించినంతనే కలుగును. (నరశింహపురాణం)
- గన్నేరు పూలతో విష్ణువుని పూజిస్తే మహాసిద్ధి కలుగుతుంది... అలాగే సాయంకాలం వీధి తలుపు మూసి ఉంచకూడదు.



## నల్లకలువ ఎంత గొప్పది

వేయి ఉత్తరేణు పూలకంటే ఒక దర్భపుష్పము అధికమైనది. దర్భ అంటే సాక్షాత్తు శ్రీమహావిషువు రోమాలే. అట్లే వేయి దర్భపుష్పాలకంటే ఓ జమ్మిపూవు అధికం... వేయి జమ్మిపూలకన్నా లక్ష్మీప్రదమైన నల్లకలువ గొప్పది. సకల పుష్పములలో నల్లకలువ మహా గొప్పది.

## శ్రీలక్ష్మీహారము

నూట ఎనిమిది లక్ష్మీ రూపులతో హారం చేయించి తొలుత శ్రీలక్ష్మీదేవికి అలంకరించి ఆపై ధరిస్తే మీ సంపదలు మీ వారసులకి నిలుస్తాయి. అదే మీ ఆర్థిక స్తోమతని బట్టి శ్రీలక్ష్మీహారం చేయించి ఆలయాల్లో ఇస్తే మీ సంపదలు మూడు తరాల తర్వాత కూడా నిలిచి వుంటాయి. కోడలికి చేయిస్తే పుట్టే మనవడు భూమిని ఏలేవాడవుతాడు. కూతురికి చేయిస్తే మహాసౌఖ్యాలని శ్రీమహాలక్ష్మి అందిస్తుంది.

## ధనమనే బ్రహ్మాస్త్రము ఎవరి మీద పడితే వారిమీద ప్రయోగించవద్దు

ధనంతో మీరు ప్రేమా, కీర్తీ, వైభోగాలను పొందండి. అంతేగాని ధనం ఆశ చూపించి లేదా పెట్టి అవతలవార్ని నాశనం చెయ్యాలనుకుంటే అన్నిసార్లూ సాధ్యపడదు. అలా హనుమంతుని మీద బ్రహ్మాస్త్రమును ప్రయోగించే ఇంద్రజిత్తు, తద్వారా లంకానగరము బూడిదయ్యింది. ఓడలు బండ్లు, బండ్లు ఓడలయ్యేది అలాంటి నిర్ణయం వల్లే. అలా ధన బ్రహ్మాస్త్రాలు ప్రయోగించే వారి పక్కనుంటే అసలువాని కంటే ముందు కొసరు వాళ్ళకే పెద్ద దెబ్బ... చదరంగంలో రాజుకి చెక్ పెట్టాలంటే రెండు మార్గాలు. మంత్రీ, సైన్యమూ ఉన్నా దూసుకెళ్ళి చెక్ పెట్టడం... లేదా చుట్టూ సకల సైన్యాన్నీ లేకుండా చేసి చెక్ పెట్టడం. రెండో మార్గం ద్వారా ఎవ్వరైనా బాధితుడు ప్రయత్నిస్తే మొదటి నష్టం పక్కనున్న వాళ్ళకే. కాన అలాంటి వ్యక్తులతో స్నేహం ధన మాన విషయాల్లో తీవ్రమైన నష్టం దరిచేరుతుంది. ఇంకా దక్షిణాయణంలో పగలు వివాహం చేసుకున్న దోషమూ తగులుతుంది.



## పురుషుడు పిరికివాడయితే శ్రీలక్ష్మి ఉండదు

పిరికితనము సకల సంపదలు పోవటానికి కారణము. భయం... భీతి... ఇవి మనకే కాదు అవతలవారికీ ఉంటాయి. మనకుండే భయాలన్నీ వారికీ వుంటాయి. కాన భయం, పిరికితనము వలదు. పరశురాముడికి భయపడి దశరథుడంతటి వాడు అంతః పుర స్త్రీలతో కలిసి చేతులకి గాజులేసుకొని వారితోపాటు తాను స్రీననే నమ్మించాడు పరశురాముడిని. అందరూ ఆడవారే అనుకొని వెళ్ళిపోయాడు పరశురాముడు. అలాంటివాడ్ని ప్రతివాడూ మొట్టుతాడు. కాన నో పిరికితనమ్.

## 108 రకాల పుష్పాలతో శ్రీలక్ష్మీపూజ

నూట ఎనిమిది రకాల పుష్పాలతో శ్రీమహాలక్ష్మీ పూజ చేస్తే అఖండ సౌభాగ్యవంతులవుతారు. సంపెంగ, చమేలి, పొగడ, మాలతి, చంద్రకాంతము, మారేడు, నీలాంబరం వుండేలా చూసుకోండి. శక్తికొలదీ భోజనాలు పెట్టండి. ఆరోగ్య సిద్ధి... సంతాన సౌఖ్యం కలుగుతాయి. మార్గశిరమాసంలో చేస్తే రెండింతల ఫలము.

## మందారము, జిల్లేడు దుర్గాదేవికి తప్ప ఇతర దేవతల పూజలకి వినియోగింపకూడదు

## అనుభవించమంటే....

వాహనాలు... పేరు... నగలు.. ధనం... అధికారం... ఇవేకాదు.. అలాంటిది లక్షల కోట్లమంది అనుభవిస్తారవన్నీ... కేవలము కొంతమంది... వేళ్ళల్లో లెక్కపెట్టే వాళ్ళు మాత్రమే కొన్ని అనుభవించగలరు... వేడి వేడి తెల్లని అన్నంపై రెండు మిల్లీ మీటరు మందంగల బంగారు రేకు వేస్తే అన్నమంతా బంగారు రంగులోకి మారుతుంది. అలా బంగారు రేకులు చేయించుకుని ఆహారపదార్థాలపై వేసి తినేవారు మహామహులు. కాన ఏవేవో ఉన్నాయని అహంకారం తగదు. అణుకువ, సత్ప్రవర్తన వల్లే అలాంటి మహా అనుభవాలు అనుభవించగలరు.

**శ్రీమహాలక్ష్మి నివాస ప్రదేశాలు గోవు, ఏనుగు తల, బిల్వదళాలు, తామరపూవులే కాదు పతివ్రతా పాపిటన కూడా శ్రీమహాలక్ష్మి నివాసము ఉంటుంది.**



## చాణక్య నీతి

యస్యార్థా స్తస్య మిత్రాణి,
యస్యార్థాని స్తస్య బాంధవాః
యస్యార్థాః న పుమాన్ లోకే
యస్యార్థాః స చ పండితః

ఎవరి దగ్గర సంపద వుంటే వారి చుట్టూ మిత్రులు వుంటారు, బంధువులుంటారు. డబ్బున్నవాడినే ఈ లోకం గౌరవిస్తుంది. డబ్బున్నవాడినే జ్ఞానిగా పరిగణిస్తుంది.

## ధర్మమే మహా పట్టాభిషేకము

ఎన్ని వేలకోట్ల సంపదలున్నా, ధర్మ ప్రవర్తన లేకపోతే కష్టం వస్తే కనీసమైన సింపతీ కూడా ఎవ్వరినుంచి రాదు. దానికి కారణము ధన మదం. తాను చేసిన ఆకృత్యాలను ప్రపంచం గుర్తు చేసుకుంటుంది. జరగాల్సిందే అంటుంది. మహా భారత యుద్ధంలో కురుక్షేత్ర రణరంగాన దుర్యోధన పుత్రుడు లక్ష్మణ కుమారుడూ, అర్జున పుత్రుడు అభిమన్యుడూ ఒకే రోజున... అయితే ఎవరికి మహా సానుభూతి లభించింది. తద్వారా అర్జునుడు ఎలా చెలరేగిపోయాడు. ఆపై విజయలక్ష్మి ఎవర్ని కటాక్షించింది.

నిల్చున్న శ్రీమహాలక్ష్మీదేవి పటాన్ని
కనులు తెరిచి ఉన్న మహాశివుడి
పటాన్ని పెట్టకూడదు. అలాగే
సంజీవిని పర్వతం తెస్తున్న
ఆంజనేయస్వామి పటాన్ని
పెట్టుకోవటం ఆరోగ్యలక్ష్మి...
శ్రీకృష్ణుడు అర్జునుడికి
గీతోపదేశం చేస్తున్న చిత్రపటాన్ని
గృహంలో వుంచుకోవటం వల్ల
ఎటువంటి దోషం లేదు.

**వ్యవసాయ సంబంధిత కార్యాల్లో
మహా విజయం కొరకు**

'ఓం హ్రీం శ్రీం వాం వసుధాయైస్వాహా' అను మూల మంత్రమును స్వయంగా నారాయణుడు తెలిపాడు. శ్రీబ్రహ్మావైవర్త పురాణం ప్రకారం ఈ పృథివీ స్తోత్రమును పఠించటం వల్ల మహారాజ భోగాలు అనుభవించగలరు.



**సంపెంగ చెట్టు**

శ్రీలక్ష్మీస్థానమెలాగో... చింతచెట్టు
ఆదిశేషుడితో సమానం. నిర్మాణ
సంబంధిత విషయాల్లో ఎంత
అత్యవసరమైనా సరే
తొలగించకుండా నిర్మాణ
సంబంధితమైనవాటిని
కట్టుకోవటం మహాశుభఫలం.

లక్ష్మీనారాయణులకి అత్యంత
ప్రీతికరమైన ధనుర్మాసంలో
నువ్వులతో చేసిన పదార్థాలను
నైవేద్యంగా పెడితే మహాశుద్ధి. మహా
దేవాధిదేవతలంతా నువ్వు
గింజలతో చేసిన ద్రవం తాగి ఈ
సకల సృష్టి ప్రారంభానికి శ్రీకారం
చుట్టారని పురాణ సారాంశము

## పుణ్యవవ్రతము చేయటం ద్వారా...

పుణ్యవవ్రతము చేయటం వల్ల సకల కోరికలు తీరుతాయి. అనేక మంగళములు జరిగి మహా సౌఖ్యాలు సిద్ధిస్తాయి. ఈ వ్రత విధానాన్ని గూర్చి పరమేశ్వరుడు పార్వతీదేవికి ఉపదేశించాడు. ఈ వ్రతాన్ని శ్రీబ్రహ్మ వైవర్త పురాణంలో చెప్పిన ప్రకారం చేయటం వల్ల ముక్తిని కూడా పొందుతారు.

## శ్రీబ్రహ్మవైవర్త పురాణం ప్రకారం శ్రీమహాలక్ష్మి ఎక్కడ వుండదు...

– శ్రీమహావిష్ణు భక్తులను నిందించే వారి గృహంలో శ్రీమహాలక్ష్మీదేవి, శ్రీమహావిష్ణువు నివశించదు.

– విశ్వాసఘాతి, మిత్రులను వంచన చేయువాని గృహము నందూ వుండదు.

– కుటిలత్వము, అపరిశుభ్ర దుస్తులను ధరించు వారి యందూ ఇంకా తడి ఆరని కాళ్ళతో నిద్రపోయేవారి యందూ, దయాహీనులయందూ, పరులను నిందించే వారి యందూ, పగలు నిద్ర పోయే వారి యందూ శ్రీమహాలక్ష్మి తన అనుగ్రహం కలుగచేయదు.



## శ్రీమహాలక్ష్మీదేవికి ఎలాంటి నైవేద్యం పెట్టాలి

అనేక రసములు కలది. బాగా రుచికరమైనది. తుష్టిని, పుష్టిని కలిగించేది. మధురమైన అన్నము, చక్కెర, ఆవుపాలు కలిపినది. కంటికి ఇంపైనది... అలాగే బాగా పండినవి, అందమైనవి, రుచి రసములు గల పండ్లను నైవేద్యంగా సమర్పించాలి. ఇంద్రుడు పుణ్య తీర్థమున స్నానమాచరించి పూజాదికాలు నిర్వహించి ఇలాంటి నైవేద్యాలను పెట్టి పోయిన సంపదలను తిరిగి పొందాడు.

## శ్రీ మహాలక్ష్మి ఇచ్చేది ధనమొక్కటే కాదు

అధికారాన్నీ, బలాన్నీ, సమస్త సంపదలనూ, కోరికలనూ, తెలివినీ, మహా భోగాలనీ, పరాక్రమాన్నీ, పోరాటంలో విజయాన్నీ, జ్ఞానాన్నీ, ధర్మాన్నీ, సౌఖ్యాలనూ, సౌభాగ్యాలను. కాన శ్రీమహాలక్ష్మిని ధనం మాత్రమే కాక ఇంద్రునిలా అన్నీ అడిగి మరీ పొందాలని శ్రీబ్రహ్మవైవర్త పురాణం శెలవిస్తోంది.

## శ్రీమత్స్య పురాణం ప్రకారం ధన లాభం కలిగించే కలలు

వృక్షము ఎక్కుట... శత్రువులపై విజయం, పాయసాన్ని తిన్నట్టు.. నిర్మలమైన ఆకాశం కనిపించటం, ప్రసాదాన్ని తీసుకున్నట్టు.. తంత్రీ వాద్యము శబ్దాలు.. గృహము ముందు ఏనుగు ఘీంకరించినట్టు, అశ్వము, గోవులు, ఒంటె ప్రసవించుట, పరస్త్రీతో సంభాషణలు, పెద్దవారితో పరిచయాలు.. ఇంద్ర ధ్వజము కౌగిలించుకొనుట వంటి కలలు ఆకస్మిక ధనలాభమని శెలవిస్తోంది.

## ఏ దేవుణ్ణి పూజిస్తే ఏ ఫలం

ఆరోగ్యాన్ని కావాలనుకుంటే సూర్యుణ్ణీ, కర్మసిద్ధికి వినాయకుణ్ణీ, ధనం కోసం అగ్నిదేవుడినీ, బ్రహ్మ తేజస్సు కోసం బ్రహ్మనూ, విభూతి కోసం ఇంద్రుణ్ణీ, భోగాల కోసం చంద్రుణ్ణీ, బలాన్ని కోరుకునేవారు వాయువునూ, మోక్షానికి శ్రీహరినీ, బ్రహ్మ జ్ఞానం కోసం విరూపాక్షుడ్నీ పూజించాలని శ్రీకూర్మ మహా పురాణం శెలవిస్తోంది. ఇట్టి అన్ని సంపదలను పొందాలనుకునేవారు శ్రీలక్ష్మీనారాయణులను పూజించాలని పద్మ పురాణం శెలవిస్తోంది.



## షోడశరాజుల చరిత్ర

“ఓ రాజా! అనేక యజ్ఞయాగాదులు చేసిన ఎందరో భూమిపై మహా తేజస్సుతో, కీర్తితో వెలిగిపోయారు. అయినా వారు శాశ్వతంగా వున్నారా? కాన నీవూ దుఃఖించ వద్దు. అట్టి మహా మహుల గాథను చెబుతాను వినుము.”

పురాతన కాలంలో ‘మదత్తు’డనే మహీపతి వుండేవాడు. అతను యజ్ఞయాగాదులు చేస్తుంటే దిక్పాలకులు సహితం విచ్చేసి తగు కార్యాలు చేసేవారు. సంవర్తుడనే మహర్షి వుండేవాడు. వానికి బృహస్పతి అంటే పడదు. దానితో ఈర్ష్యాసూయలతో ఋత్విక్కు స్థానంలో వుండి యజ్ఞకార్యాలు నిర్వహించాడు. మహా మహా మహర్షులంతా వచ్చి మదత్తనృపతిని ఆశీర్వదించారు. ఆ మహారాజు ఎన్నో భూరి దక్షిణలతో, స్వర్ణాభరణాలతో ఎందరినో సత్కరించాడు. అవి అందుకున్నవారు తామెన్నడూ అంతటి వాటిని పొందలేదని వేనోళ్ళ పొగిడారు. అట్టి రాజు నేడు వున్నాడా?

అలాగే సుహోత్రుడన్న రాజు. ధర్మపుణ్యమార్గాల్లో మహారాజు అయ్యాడు. వాని కార్యాలకి భూప్రజలే కాక స్వర్గలోకవాసులంతా పరమానందం చెందారు.

అమరులు సహితం కీర్తించబడ్డ వాని రాజ్యంలో వర్షం పడినప్పుడు వరుణ దేవుడు బంగారు ఎండ్రకాయలను, చేపలను, తాబేళ్ళని వర్షంలో పంపాడు. ఆ మహా ధనాన్ని అనేకమంది అర్హులకి ఇచ్చి అనేక అశ్వమేధాది యజ్ఞాలు నిర్వహించాడు. అట్టి మహాత్ముడు, ప్రజా పాలకుడు నేడు లేడు కదా.

అంగుడు అనే రాజు అనేక యజ్ఞ యాగాదులు చేశాడు. బంగారంతో ప్రకాశించే ఏనుగులను, మహా వేగంతో పోగలిగే అశ్వాలనూ, బంగారు కొమ్ములు గల ఆవులనూ, అలాగే మేకలనూ, కన్నెలనూ, అనేక రత్న ఆభరణాలను దానాలు చేశాడు. ఆ అంగుడు శరీరాన్నించి కూడా ప్రాణి వెళ్ళిపోలేదా?

ఇక శిబి చక్రవర్తి స్యందనం అనగా సప్తద్వీపాలతో, శత్రువన్న వాడు లేని శిబిచక్రవర్తి సకల ప్రజలను కన్నబిడ్డల్లా చూసుకున్న శిబి చక్రవర్తి నేడు వున్నాడా? వాని రాజ్యపాలనుకూ, ధర్మనిష్ఠలకూ మెచ్చి పరమశిడు వానికి అక్షయ ధనాన్ని ప్రసాదించాడు. పవిత్రమైన గంగానది ఒడ్డున చెప్పలేనన్ని యజ్ఞాలు చేశాడు. వాన చినుకులను ఎలాగోలా లెక్కించవచ్చును గాని, శిబిచక్రవర్తి దానాలను లెక్కించగలమా. అట్టి మహా కీర్తిమంతుడు నేడు వున్నాడా.



ఇక శ్రీరామచంద్రుని తండ్రి దశరథ మహారాజు...తండ్రి ఆజ్ఞతో అడవులకి భార్యా సోదరుడితో శ్రీరాముడు తరలి వెళ్ళాడు. వారధిని నిర్మించి లోకాలకి కంటకుడైన రావణుడ్ని వధించి, పసిపిల్లల అకాలమృత్యు భీతిని తొలగించాడు పుణ్యవీరుడు శ్రీరామచంద్రుడు. అట్టివాని తండ్రి దశరథ మహారాజు కాలగర్భంలో ఇమిడిపోలేదా.

సగరుడు ఎంతటి గొప్పవాడు. తన పూర్వీకుల అపూర్వ సంకల్పము నెరవేర్చటానికి ఆకాశగంగను భూమిపైకి తెచ్చినవాడు. భగీరథ నామంతో లోకవిఖ్యాతి సంపాదించుకున్నవాడు. మహేంద్రుడే ప్రశంసించేలా ఎన్నో యాగాలు చేశాడు. అశ్వమేధాది యజ్ఞాల్లో, ధర్మకార్యాల్లో మహా వైభోగ ధనం గల రథాలపై కన్నెలను ఎక్కించి ప్రతి రథానికి వంద ఏనుగులను, ఒక్కో ఏనుగుకి వెయ్యేసి అశ్వాలనూ, ఒక్కో అశ్వానికి వెయ్యి గోవులను ఇచ్చి దానం చేశాడు. అంతటి దానవంతుడూ, ఆ భగీరథుడు భూమిపైకి గంగను తెచ్చిన ఆ సగరుడు నేడు వున్నాడా?”

అలాగే దిలీప సార్వభౌముడు హయమేధ క్రతువుల్లో విశ్వావసుడు మేనకలతో పాటు అనేక గంధర్వాదులంతా వచ్చి సంగీత గోష్ఠులు చేసేవారు. అప్సరస

సుందరీమణులు నృత్యగానలాపనలతో విచ్చేసి అందరినీ ఆనందింపచేసేవారు. అమరేశ్వరులు మహా ప్రకాశం గల మెరుపులతో విచ్చేసి దిలీప మహారాజుకు సంతోషాన్ని కలిగించేవారు. పంచభక్ష పరమాన్నాలతో మహా ధనరాసులు పొందిన భూజనులు మహీపతిని కీర్తించని క్షణమున్నదా. ఆ మహేంద్రుడే దిగి వచ్చి అశ్వమేధ అశ్వాన్ని అర్థించాడు. దేవేంద్రునికి యజ్ఞ అశ్వాన్ని ఆనందంగా దిలీపుడు ఇచ్చేశాడు. అట్టి దిలీపుడు ఏడి... ఎక్కడ?

ఓ సంజయ మహారాజా, మాంధాత చక్రవర్తి తాను జన్మించింది మొదలు ఇంద్రుడి చేతిలోని నెయ్యీ, పెరుగూ, పాలూ తాగి పన్నెండు సంవత్సరాలు వయస్సులోనే సమస్త రాజ్యాన్ని పొందాడు. సూర్యోదయ, సూర్యాస్తమయ పర్వతాలే తన రాజ్య సరిహద్దులుగా చేసుకొని అఖండ భూమండలాన్ని ఏలాడు. మహా పర్వతాల వంటి సంపదలను దానాలు చేశాడు. అటువంటి ఆ మాంధాత ఏడి.

యయాతి పృథివీపతి ఏకంగా దేవతలకే సహాయం చేశాడు. దానవ సంగ్రామంతో రాక్షసులెందరినో సంహరించి దేవతలకి ఉపకారం చేశాడు. హయమేధం, అగ్నిష్టోమం, అతిరాత్రం, వాజపేయము, పౌండరీకం,



సత్రయాగం వంటి యజ్ఞాలు చేశాడు. శుక్రుడు అల్లుడు. అనేక ధర్మకార్యాలతో మహాకీర్తిని పొందినవాడు నేడు లేడు కదా!

అంబరీష మహారాజు... వాని ధర్మపుణ్యకార్యాలకి శత్రువులు అసూయ చెంది అంతా ఒక్కటై దండెత్తి వచ్చారు. మహా పరాక్రమంతో వారి రథాలనూ, కవచాలనూ చీల్చి శరణన్న వారిని సంరక్షించిన కరుణా మూర్తి, సకల భూమండలాన్నీ ఏలిన ఆ అంబరీష చక్రవర్తి, సకల రత్నరాసులను భూరిదక్షిణలుగా ఇచ్చిన అంబరీషుడు నేడు వున్నాడా.

లక్షమంది భార్యలు గల శశిబిందుడు, తన ప్రేమద్వారా ఒక్కొక్క భార్య నుంచి వేయిమంది సంతానాన్ని పొందాడు. వారంతా తండ్రికి తోడై, నీడై నిలువగా అనేక అశ్వమేధయాగాలు చేశాడు పదికోట్ల మంది పుత్రులు గల శశిబిందుడు. అపార కీర్తి గడించిన వాడు ఈ మట్టిలో కలిసిపోలేదా.

అలాగే గయ మహారాజు నిరంతర తపస్సుతో జాజ్వల్యమాన స్వరూపుడైన అగ్నిభట్టారకుడ్ని సాక్షాత్కరింప చేసుకున్నాడు. ఆ మహనీయుని వల్ల బ్రహ్మచర్యమూ, సౌశీల్యమూ, దమము, శమము,




వేదాలను గ్రహించడము వంటివి పొందాడు. రత్నాలూ, బంగారంతో ముప్ఫై ఆరు యోజనాల పొడవూ, వెడల్పు గల యజ్ఞవేదికను నిర్మించి మహా యజ్ఞాలు చేశాడు. అట్టి మహీనాథుడు ఎక్కడ... ఏమయ్యాడు?

ఇరవై వేలమంది వంటవారిని పెట్టాడు రంతిదేవుడు. అభ్యాగతాది అతిథులకు వండి వార్చటమే వారి పని. అంతటి రంతిదేవుడు యజ్ఞయాగాదులు చేస్తుంటే పశువులు తామే వచ్చి ఉత్తమ గతి కోసం సిద్ధమని చెప్పేవి. అమరలోక వాసులు స్వయంగా వాటి తలలు నరికి కమ్మని మాంస భోజనాదులతో సంతృప్తులయ్యారు. సత్ర యాగాదులు చేసిన రంతిదేవుడు మహా పుణ్యాత్ముడు, అపార సంపద కలిగిన వాడు. అంతకుమించిన కీర్తి గలవాడు ఎక్కడ. పుణ్యలోకాలకి వెళ్ళలేదా.

చిన్ననాడే మహా క్రూర జంతువులను పొట్టేళ్ళవలే నియంత్రించిన సర్వదమనుడు అనగా భరతుడు రాజ్య పదవి పొంది గంగాయమునా సరస్వతీ నదీతీరాల్లో రాజసూయం వంటి ఎన్నో యజ్ఞాలు చేశాడు. బంగారంతో మెరిసిపోయే ఏనుగులనూ, అశ్వాలనూ దానాలుగా ఇచ్చాడు. అట్టి నరేంద్ర చంద్రుడు భరతుడు మాత్రం నేడు వున్నాడా. అందరివలే ఈ ఇహలోకాన్ని వదిలినవాడే కదా.






మహా పురాతన కాలంలో భూమి మెట్ట పల్లాలతో వుండేది. తన రథం సరిగా వెళ్ళలేకపోవటంతో ఆ మహీపతి మెట్టపల్లాలను చదును చేయించాడు. అందుకే ఆ పుణ్యాత్ముడు పృథుచక్రవర్తిగా కీర్తి గడించాడు. వారి పేరు మీదనే భూమిని పృథ్వి అని కూడా పిలుస్తున్నారు. గోరూపంలో వున్న భూదేవిని ఓషధులూ, రత్నాలూ పిదకవలసిందిగా చెప్పి, వాటితో లోకానికి పోషణ కలిగించాడు. ఇక యజ్ఞయాగాదుల గూర్చి దాన ధర్మాల గూర్చి చెప్పవలసిందేముంది? కీర్తి నేటికీ వుంది. కాని వాని శరీరం...

కార్తవీర్యుడి వేయి బాహువులనుని ఖండించిన పరశురాముడు సకల రాజ్యాలపై దండెత్తి అందరి రాజ్యాలను తన రాజ్యంలో కలిపేసుకున్నాడు. ఇరవై ఒక్కసార్లు దండెత్తి సాధించిన సకలభూమండలాన్ని కశ్యపుడికి ధారాదత్తం చేశాడు. అందువల్లనే భూమిని కాశ్యాపి అనే పేరుతో కూడా పిలిచేది. అట్టి పరశురాముడే నేడు శాశ్వతంగా వుండగలిగాడా?

కాన ఎంత శక్తివంతులైనా, మహా ధనరాసులున్నా, సకల భూమండలమే స్వంతము అయినా మిగిలేది కీర్తి మాత్రమే....




## గృహంలో గోదాదేవి కళ్యాణం చేస్తే

మహా సంపదలూ, సౌఖ్యం కలుగుతాయి. కళ్యాణంలో మొలకులన్న కందను సమర్పిస్తే మొలకలు వృద్ధి చెందినట్టు వంశాభివృద్ధి. దానితో పాటు సంపదలూ పెరుగుతాయి. వివాహాల విషయంలో ఎలా చేసినా పర్వాలేదు.... పూజాదికాల్లో మధుపర్కం అంటే బట్టలే కాదు... పంచామృతము... అందులో ఈగలు పెట్టిన తేనెని మాత్రమే వాడాలి.

## కొల్హాపూర్ ఎంతటి దివ్యక్షేత్రము

కొల్హాపూర్ శ్రీమహాలక్ష్మి ఆలయం శివాలయమనీ, పద్మావతీపురమనీ, దక్షిణ కాశీయనీ పిలుస్తారు. అయితే కాశీ కంటే ఈ క్షేత్రం మహా పవిత్ర మహిమ గలది. కాశీకన్నా కొల్హాపూర్ గోధుమ గింజంత ఎక్కువ పవిత్ర మహిమ గల క్షేత్రమని శ్రీమహావిష్ణువు చెప్పాడు. అత్తమామలను గౌరవించని స్త్రీ, తండ్రిని సేవించని పురుషుడూ, కాశీకి వెళ్ళినా పుణ్య ఫలం రాదు. అశ్వమేధాది యజ్ఞాలు చేసినా పైసా రాల్చదు లక్ష్మీదేవి.






**మహా భారతంలోని అకంపనోపాఖ్యానం చదివితే అయురారోగ్యాలూ, కీర్తిలతో పాటు మహాసంపదలూ, సౌఖ్యాలూ కలుగుతాయని పరాశరపుత్రుడు శెలవిచ్చి వున్నాడు.**

## శ్రీలక్ష్మికి కోపం వస్తే

భర్త శ్రీమహావిష్ణువుకే ఆమెని ప్రసన్న చేసుకోవటానికి పన్నెండేళ్ళు పట్టింది.. సకల దేవతలకి దర్శనం ఇచ్చే శ్రీలక్ష్మి కరివీరపురంలో వుండే తీర్థాలలో స్నానం చేసి దర్శనం కోరినా ఆమె కరుణించలేదు. కాన శ్రీలక్ష్మికి కోపం వచ్చే పనులు చేస్తే ఆమె అనుగ్రహం పొందటానికి చాలా ఏళ్లు పడుతుంది. కాన భార్య గృహలక్ష్మి. చులకన చేస్తే పోయేది పురుషుడి సంపదలే.




## ధనం దగ్గర మొహమాటం పనికి రాదు

తన వివాహానికై కుబేరుని వద్ద అప్పు తీసుకున్నాడు లక్ష్మీవతి. ఆ విషయం తెలిసి శ్రీమహాలక్ష్మి శ్రీనివాసుడితో అంది 'స్వామీ.. సకల జనులకి ధనసంపదలిచ్చే నన్నే భార్యగా పొందీ అప్పు చెయ్యాల్సిన అవసరం ఏముంది. ఒక్క మాట అడిగితే నేనే ఇచ్చేదాన్ని. పైగా కుబేరుని వద్ద వడ్డీకి... బాకీ వుంటే సుఖంగా వుండగలరా' అని.... శ్రీమహావిష్ణువు సహితం మారు మాట్లాడలేదు. నీవే చూసుకోవాలన్న అర్థం వచ్చేలా చూశాడు లక్ష్మీదేవి వైపు. అందువలననే శ్రీమహాలక్ష్మి విష్ణుభక్తులకు ధనాలను ఇస్తూ తద్వారా స్వామికి సమర్పించే సంపదలను కుబేరునికి వడ్డీ రూపంగా పంపుతూ భర్త శ్రీమహావిష్ణువుకి ధనసమస్యలు లేకుండా చేస్తోంది.

## ఒకే వృత్తిలో ఉన్నవారు గొడవలు పడుతుంటే...

దూరంగా వుండండి. అలా కాకుండా, ఎవరో ఒకరి వైపు లేదా ఇద్దరి వైపు వుంటే, ఎప్పటికైనా నష్టం జరిగేది మీకే... జీవితంలో పెద్దస్థాయిలోకి వెళ్ళాలంటే






వృత్తిలో శత్రువులు ఉండకూడదు. అలాంటి సందర్భంలోనే ఎవ్వరికైనా శత్రువులు ఏర్పడేది. అలా ఏర్పడితే మీ వృత్తిలో మీరు ఎంత ప్రయత్నించినా రాణించలేరు.

## శ్రీమహావిష్ణుభక్తులనంటే స్వామి అసలు ఊరుకోడు

తనని తిట్టినా, దూషించినా పట్టించుకోని స్వామి తన భక్తులకు బాధ కలిగించేలా ప్రవర్తిస్తే చేసిన వార్ని వదలిపెట్టడు. తన భక్తురాలు వెంగమాంబ మీద పుల్లి విస్తరాకులు వేసి అవమానించినందకు ఆక్కారం దీక్షితుల వంశాన్నే ఆనాటితో నరిచేశాడు. కాన శ్రీలక్ష్మీనారాయణుల భక్తులకు వ్యధ కలిగించిన కలియుగమని కూడా చూడకుండా తానే కలుగ చేసుకొని శిక్షిస్తాడు.

## వైకుంఠంలో శ్రీలక్ష్మీనారాయణులు

శ్రీమహావిష్ణువు వైకుంఠంలో పాలసముద్రం పైనున్న వేయి తలల ఆదిశేషునిపై కుడిచేతిని తలకి ఆనిచ్చి కుడివైపు ఒత్తిగిలి పడుకుని వుంటే ఆయన పాదాల వద్ద శ్రీమహాలక్ష్మి మృదువైన పాదాలను ఒత్తుతూ వుంటుంది. స్వామి పట్టుపీతాంబరాలలో, నవరత్న ఖచిత దివ్య ఆభరణాలతో ప్రకాశిస్తుంటాడు.




## తిరుమల పుష్కరిణి ఎంతటి మహత్యం కలది

దరశథ మహారాజు స్వామిపుష్కరిణిలో స్నానతపాలు చేసి శ్రీమహావిష్ణువునే తన పుత్రుడిగా జన్మించమని కోరి పొందాడు. శంఖుడనే రాజు పోయిన తన సమస్త సంపదలను తిరిగి పొందాడు. అలాగే కుమారస్వామి తారకాసురుణ్ని సంహరించటం వల్ల కలిగిన బ్రహ్మహత్యాపాతకాన్ని ఈ పుష్కరిణిలో స్నానం చేసి పోగొట్టుకున్నాడు. ఈ పుష్కరిణిలో స్నానం చెయ్యటం వల్ల మహా వ్యధలు ఎందరికో తొలిగాయి. అఖండమైన సిరి సంపదలతో తుల తూగిన వారెందరో.

## శ్రీమహాలక్ష్మి సముద్ర మధనంలో ఎందుకు జన్మించవలసి వచ్చింది

మహా కోపిష్ఠి అయిన దుర్వాస మహర్షి శ్రీవైకుంఠాన్ని దర్శించినపుడు శ్రీమహాలక్ష్మీదేవి మాటలకు ఆ మహర్షి కోపించి సముద్రంలో పడాల్సిందని శపించాడు. ఆపై శాంతించి ఆ సముద్రమధన సమయంలోనే ఆవిర్భవించి శ్రీమహావిష్ణువుకు పెళ్ళాడగలవని శాపవిమోచనం చెప్పాడు.






## ఏ రోజు ఏ లక్ష్మికి పూజ చేస్తే సత్వర ఫలం

ఆదిలక్ష్మిని తెల్లటి పూలతో ఆదివారము, ధాన్యలక్ష్మిని పచ్చని పూలతో సోమశుక్రవారాలూ, ధైర్యలక్ష్మిని ఎర్రని పూలతో మంగళవారము, గజలక్ష్మిని నీలమువర్ణం గల పూలతో శుక్ర, సోమవారములూ, సంతానం కోసం సంతానలక్ష్మిని మంగళవారం (ఈ పూజలో పళ్ళని ఎవ్వరికి ఇవ్వకుండా పూజ చేసిన దంపతుల స్వీకరించాలి), విజయలక్ష్మిని ఎరుపుపూలతో సోమశక్రవారాలు, విద్యాలక్ష్మిని శుక్రబుధగురువారాలు తెల్లని పూలతో, ఇక సంపదలనిచ్చే ధనలక్ష్మిని వారంలో ఏ రోజైనా పూజ చేసి మహా ఫలాలను పొందవచ్చు... పుజానంతరం తీర్థాన్ని స్వీకరించి ఇల్లంతా చల్లుకోవాలి.

## తేలికగా నమ్ముతారని అవతల వారికి తెలిస్తే చాలు....

అవతలవాళ్ళు వేరేపని పెట్టుకోరు. మీపని మీదే వుంటారు. వాళ్ళు చెప్పినవి నమ్మి విశ్వసించి చేస్తే కాంభోజ రాజులా సర్వమూ పోగొట్టుకోవాల్సి వస్తుంది. ఆ రాజు సన్నిహిత మిత్రులే నట్టేట ముంచారు. దానితో

కాంభోజ రాజు శంఖణుడు శ్రీమహాలక్ష్మిని పూజించి పరమపవిత్రమైన పద్మతీర్థంలో స్నానం చేసి అనేక పుణ్యక్షేత్రాలూ, తీర్థాలూ దర్శించి తిరిగి శ్రీమహాలక్ష్మి కృపతో రాజ్యాన్ని పొందాడు. ఇది ఆ రాజప్పటి యుగం కాదు. పోయినవన్నీ తేలికగా తిరిగి రప్పించుకోవటానికి.

**ముక్కోటి ఏకాదశి రెండవరోజు కూడా తిథి వుంటే ఆ రోజు ఉపవాసం వుండాలి. ముక్కోటి ఏకాదశి సరస్వతీదేవి, గంగాదేవి, బంగారం, సూర్యునివలే, గాయత్రీ మంత్రం వలే, కౌస్తుభంవలే, హిమవంతునివలే, కుబేరుని వలే, ఇరావంతునివలే అత్యంత ముఖ్యమైన తిథి.**



**శ్రీమహావిష్ణువు మత్స్యావతారమెత్తినప్పుడు ఆయన తోడుగా శ్రీమహాలక్ష్మిగా అదే పేరుతో అవతరించింది. కూర్మావతారంలో కూర్మవల్లిగానూ, నరశింహావతారంలో చెంచులక్ష్మిగానూ, అవతరించింది సిరులతల్లి**